ఆంధ్రలో

# కమ్యూనిస్టు వ్యతిరేకుల నగ్నస్వరూపం



రచన

ఎ. యస్. ఆర్. చారి



అనువాదం

వాసిరెడ్డి భాస్కరరావు



ప్రజా ప్రచురణాలయం,

నారాయణగుడా, హైదరాబాద్ (దక్కన్.)

# పరిచయం

ఒక రకపు కాంగ్రెసువాదుల్లో కమ్యూనిస్టు వ్యతిరేకత నేడొక ఫేషన్ అయిపోయింది. కమ్యూనిస్టు ప్రచారాన్ని అరికట్టడానికి అనేక రకాల పద్ధతులవలంభిస్తున్నారు. మూలసూత్రాల్లోనే రాజకీయ భేదాభిప్రాయాలున్నాయని వారంటున్నారు. నిజంగా అలాంటి అభిప్రాయభేదాలేవుంటే వాటిని ఏలా పరిష్కరించుకోవాలి అనేదే ప్రశ్న. ఉన్నభేదాల్ని పోగొట్టుకోవడానికి అవలంబించే పద్ధతుల్లోనే ఉభయుల మంచీ చెడూ బైటపడుతుంది. ఈనాడు మన కర్తవ్యమేమిటి? అన్నదమ్ములాగా కలిసి మనలో మనకున్న అభిప్రాయ భేదాల్ని మర్యాదగా చర్చించుకుందామా? అప్పటికీ మన ఉభయులం అంగీకారయోగ్యమయిన ఒక ఒడంబడికకు రాలేకపోతే ప్రజలముందేపెట్టి వారు చెప్పే తీర్పుకు బద్ధులంగావడానికి సిద్ధంగా వున్నామా? లేక అవినీతికరమయిన అపనిందలమీదే ఆధారపడి, గుడ్డి ద్వేషాన్ని రెచ్చగొట్టి, తగాదాల్ని పురికొల్పి, నిర్మలమయిన రాజకీయ వాతావరణాన్ని విషపూరితం చేయడమేనా మనపని?

మన జాతీయ జీవితంలో నేటి పరిస్థితులు క్రమంగా రెండోవైపుకే మొగ్గుతున్నాయి. కాంగ్రెసు ప్రెసిడెంటు మౌలానా అజాద్ గారిని నిరసిస్తూ శ్రీనగరులో జరిగిన రౌడీ ప్రదర్శనం ఏం తెలియజేస్తుంది? ఢిల్లీ రైల్వే స్టేషన్లో, అలిఘర్ రైల్వే స్టేషన్లో జరిగిన దౌర్జన్య చర్యలు మనకేం గుణపాఠం నేర్పుతున్నాయి?

ఈ గూండాయిజాన్ని ఖండిస్తూ పండిట్ నెహ్రూ చెప్పిందేమిటి? "సామాన్య పరువు మర్యాదల్ని కూడా పాటించని యీ ప్రజల (రౌడీల) అసహ్యాకర ప్రవర్తన నామనస్సునెంతో అధికంగా, కలతబెట్టింది.......ఈ లాంటి బూతుల ప్రచారానికి, దౌర్జన్యానికి, వెనక అండగావుండి యీచర్యల్ని సమర్ధించే వాళ్ళని చూస్తే నాకు అరికాలు మంట నెత్తికెక్కుతుంది. ఇదంతా చూస్తూవుంటే బహిరంగంగా కయ్యానికికాలు దువ్వుతున్నారా అని పిస్తుంది. ఈ దౌర్జన్యం తప్పకుండా దారుణమయిన హింసాకాండకే దారితీస్తుంది. రాజకీయోద్యమ ప్రవాహంలో నిమ్నోన్నత దశలుండటం సహజమే. ఒక్కొక్కప్పుడు పరిస్థితులు బాధాకరంగా వుండే మాటా వాస్తవమే. అయినప్పటికి పతనానికికూడా ఒక హద్దూపద్దు ఉండాలి. సాంఘిక నైతిక జీవితాన్నే దెబ్బగొట్టే యీ దిగజారుడు విధా

నానికి ప్రజాబాహుళ్యం ఏ మాత్రం అంగీకరించజాలదని పూర్తిగా నేను విశ్వసిస్తున్నాను. పరిస్థితులీవిధంగా నానాటికి విషమిస్తూవుంటే కండ్లారా చూస్తూ ప్రజాసామాన్యం సహించదు."

తప్పుడు పనులు చేసినవాళ్ళనీ, చేయించినవాళ్ళనీ, నెహ్రూపండితు డెంత తీవ్రంగా ఖండించాడో చూశాం.

కాని, కొందరు కాంగ్రెసునాయకులే కమ్యూనిస్టులమీద పోరాటానికి నేడు సరిగ్గా ఆలాంటి తప్పుడు పద్ధతుల్నే అవలంబిస్తున్నారంటే యెంత విచారకరమైనవిషయమో ఆలోచించండి. కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం ఎంత క్రుతిమించి పోయిందో, చివరకు గాంధీగారి చెవుల్నిగూడా విష పూరితంజేయడానికి సామాన్యసభ్యతా పరిపాటినికూడా పాటించకుండా కాంగ్రెసువాదులు ఎంతటి నీచానికి, పాల్పడ్డారో, ఎంతటి దుష్ప్రచారానికి ఒడిగట్టారో గాంధీ-జోషీలేఖలు చదివిన ప్రతివారికి స్పష్టంగా తెలుస్తుంది. గాంధీ-జోషీలేఖల్లో ఉల్లేఖింపబడిన దానికంటెకూడా వాస్తవానికి అసలు జరుగుతూవున్న ప్రచారం యింకా అధ్వాన్నంగా వుంది. ఉదాహరణకు ఆంధ్రరాష్ట్రాన్ని తీసుకుందాం. అనేకమంది కమ్యూనిస్టు యువతీ యువకు లకు పితామహులుగా ఉండదగిన వయోవృద్ధులై, నలభై సంవత్సరాలనుంచి కాంగ్రెసువాదులుగా ఉన్నామని సగర్వంగా చెప్పుకొనే కాశేశ్వరరావుబోటి ముఖ్య నాయకులుకూడా కమ్యూనిస్టులకు వచ్చేడబ్బును గురించి, వారి నైతిక ప్రవర్తనను గురించి విపరీతమయిన చెడు ప్రచారంసాగిస్తున్నారు. అతినీచమయిన వెంగమ్మ నాటకాన్ని ఉపయోగించుకోవడానికికూడా జంక లేదు. ఈదుష్ప్రచారం చివరకెంత నీచంగా పరిణమించిందో తెలుసుకోవ డానికి స్థాలీపులాక న్యాయంగా యీ ఒక్క వెంగమ్మ నాటకమేచాలు.

ఈవెంగమ్మ నాటకాన్ని పరిశీలించేముందు జాతీయోద్యమంవైపు ఒక్కసారి మనదృష్టిని ప్రసరింపజేద్దాం. జాతీయోద్యమం ఇంకా శైశవా వస్థలోవున్న ఆ రోజుల్లో గాంధీజీని గురించి, కాంగ్రెసునుగురించి యీ లాటి దుష్ప్రచారమే సాగుతూ వుండేది. దినదినాభివృద్ధి నందుతూవున్న కాంగ్రెసు పలుకుబడిని తగ్గించడానికి ఆనాటి కాంగ్రెసు వ్యతిరేకులయిన గవర్నమెంటు తొత్తులు, కులతత్వవాదులు కూడా ఈదుష్ప్రచారాయుధాన్నే ఉపయోగించారు. తిలక్ స్వరాజ్యనిధిని మన జాతీయనాయకు లపహరిం చారనీ, గాంధీగారు బిర్లాగారి పెట్టిపోతల్లోవుండే బంటు అనీ, సబర్మతీ సేవాగ్రాం ఆశ్రమాల్లో అవినీతి ప్రబలిపోయిందనీ, ఇంకా ఏవేవో నోటికి

వచ్చినట్లల్లా వాగుతూవుండేవాళ్ళు. ఇదంతా మనకు బాగా తెలిసినసంగతే. ఇలాంటి నీచుల దగ్గిరనుంచే నేడు మన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసునాయకులు తమ దుష్ప్రచారాయుధాన్ని అరువు దెచ్చుకున్నట్లుంది. ఇంతలోనే వెనకటి విషయాలన్నీ మన కాంగ్రెసు పెద్దలు మరచిపోయ్యారేమో?

ఆంధ్రరాష్ట్రంలో ఎన్నాళ్ళనుంచో యీ కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం యథేచ్ఛగా సాగుతూవుంది. ఈ అఘాయిత్యం అంతాచూచి ఆంధ్రరైతాంగం అసలు కాంగ్రెసుసంస్థకే దూరమై పోతుందేమోఅని యింతవరకూ వీరి అసలురంగును పూర్తిగా బట్టబయలు చేయకుండా ఓపికపట్టాం. సభల్లో సమావేశాల్లో సమాధానాలు సంజాయిషీలు యిచ్చుకోవడంతోనే సంతృప్తిపడ్డాం. ప్రస్తుతం జైళ్ళల్లోవున్న ప్రముఖ నాయకులంతా విడుదలై బైటికి వచ్చినతర్వాత పరిస్థితుల్ని చక్కజేస్తారనీ, కాంగ్రెసువాదుల్ని ఇకనైనా సక్రమమార్గాన నడిపిస్తారనీ, ఎంతోఆశించాం. ఈ బూతులప్రచారానికి యింతటితో స్వస్తిజెప్పి కల్మష భూయిష్ఠమైన రాజకీయ వాతావరణాన్ని పరిశుభ్రపరచి కాంగ్రెసు సంస్థని పునరుజ్జీవింపజేస్తారని యింతవరకూ ఎదురుచూశాం. కాని మా ఆశలన్నీ అడియాసలయ్యాయి. అవినీతి కరమయిన చర్యల్ని అరికట్టడానికి బదులు, బైటికి వచ్చిన కాంగ్రెసు ప్రముఖులుకూడా అందులోనే భాగస్వాములయ్యారు. ఇంతవరకు ఒక్క కాంగ్రెసు నాయకుడైనా యీ తప్పుడు పద్ధతుల్ని ఖండించిన పాపానబోలేదు.

ఇందువల్ల జరిగిన విషయమంతా ఇప్పుడు సమగ్రంగా ప్రకటించవలసి వచ్చింది. కమ్యూనిస్టులమీద ఎటువంటి బూతులప్రచారం జరిగింది? ఎవరు దీనికికారకులు? ఆంధ్ర కాంగ్రెసు నాయకులు దీన్ని ఏ విధంగా సమర్థిస్తున్నారు? మొదలయిన విషయాలన్నీ ఇచ్చట పూర్తిగా చర్చిస్తాను. రాజకీయాలు చివరకేదారిబట్టి పోతున్నాయో తీవ్రంగా ఒకసారి ఆలోచించవలసిందని ప్రతి కాంగ్రెసువాదినీ కోరుతున్నాను. రాజకీయ వాతావరణమంతా యీ విధంగా కలుషితమై పోకుండా కాపాడాలసిన బాధ్యత ఎక్కువగా జాతీయనాయకులదే. రాజకీయ జీవితాని కవసరమైన ప్రాథమిక పౌరసత్వహక్కుల్ని రక్షించి దేశభక్తులందర్నీ ఐక్యపరచి సమస్త భారతవర్గాన్ని గమ్యస్థానికి చేర్చగల భారం ప్రధానసంస్థకు నాయకులుగావుండి నడిపిస్తూవున్న వారి భుజాలమీదనే అధికంగా వుంది.

•••○◯○•••

# వెంగమ్మ నాటకం

ఇది గద్యపద్య సమన్వితమయిన అయిదుఅంకాల నాటకం. దీని రచయిత తెనాలితాలూకా వాస్తవ్యులయిన యడ్లపల్లి కోటయ్యగారు. ఈయన 1940 వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొన్నాడు. ఫార్వర్డ్‌బ్లాక్, రంగా అనుచరులు కలసి సాగించిన విధ్వంసక చర్యల్ని సమర్థించాడు.

ఈ నాటకం కాకాని వెంకటరత్నంగారి (ఆంధ్రరాష్ట్ర ఫార్వర్డ్ బ్లాక్ నాయకుడు) మేనల్లుడైన నరసయ్యగారిచే ప్రచురింపబడింది. దీనికి గాంధీగారి ఆశీర్వాదబలంకూడా వుందేమో అనేటట్లుగా మొదటిపేజీమీద గాంధీగారి చిన్న ఫోటో ఒకటి వేయించారు.

## ప్రధానపాత్రలు

కామ్రేడ్ సుందరయ్య కథానాయకుడు. (సుందరయ్య పేరుకూ సుందయ్య పేరుకూ ఉన్న పోలికను తేలికగా ఊహించుకోవచ్చు) యీ సుందయ్య వట్టి ముండలముఠాకోరు, అబద్ధాలకోరు, దగాకోరు. కామ్రేడ్ వెంగమ్మ సరేసరి కథానాయిక. ఇది వరకే పెండ్లిఅయిన వెంగమ్మను సుందయ్య లేవదీసుకెళతాడు. యీమెకూడా కమ్యూనిస్టుపార్టీలో సభ్యురాలవుతుంది. అంతటితో పాశ్చాత్యవేష భూషితురాలయిన వెంగమ్మ స్త్రీ పురుష సంబంధాల్లో విచ్చలవిడిగా ప్రవర్తించవచ్చునని స్వేచ్ఛాప్రేమ సిద్ధాంతాన్ని (ఫ్రీ లవ్) ప్రచారం చేస్తుంది. చివరకీమెకూడా ప్రథమ శ్రేణికి చెందిన కులటలాగా తయారవుతుంది. సుఖ సంకటాల కాలవాలమైన యీమెను కమ్యూనిస్టులు వదిలేస్తే రామయ్య అనే కాంగ్రెసు దేశభక్తుడు. ఆశ్రయమిచ్చి కాపాడుతాడు.

## కథాసంగ్రహం

### ప్రథమాంకం

పోలీసు వెంబడిస్తూవుండగా పరుగెత్తుతూ సుందయ్యప్రవేశిస్తాడు. దీనితో నాటకం ప్రారంభమవుతుంది. సుందయ్య యిలా పరుగెత్తుతూ దాక్కోవడానికి వెంగమ్మ యింటికి వస్తాడు. కమ్యూనిస్టుపార్టీ అప్పటికి కింకా నిషేధించబడే వుండటం వల్ల సుందయ్యను పట్టుకోవడానికి పోలీ

సులు వెంటాడుతూ వుంటారు. ఉద్యోగమేదైనా సంపాదించుకోవడం కోసం వెంగమ్మ భర్త ఎక్కడికో వెళ్ళిపోతాడు. ఏకాంతంగా వున్న వెంగమ్మను ఎక్కువ కష్టం లేకుండానే సుందయ్య తన వల్లో వేసుకుంటాడు. ఇంతలో ఒక కామ్రేడ్ వచ్చి బొంబాయినుంచి వచ్చిన ఉత్తరాన్ని సుందయ్య చేతికిస్తాడు. కమ్యూనిస్టుపార్టీ గవర్నమెంటు మధ్య ఒక రహస్యపు ఒడంబడిక జరిగిందనీ, అందువల్ల పార్టీమీదఉన్న నిషేధాన్ని ప్రభుత్వం తొలగించిందనీ, యికనుంచి యిప్పుడు జరుగుతూన్న యుద్ధాన్ని ప్రజాయుద్ధంగా ప్రచారం చేయమనీ, ఆవుత్తరంలో వుంటుంది. దీనితో రంగం సమాప్తి.

(పార్టీమీద నిషేధం తొలగకపూర్వం ఆరుమాసాలముందే కమ్యూనిస్టుపార్టీ యుద్ధాన్నిగురించిన తన వైఖరినిమార్చుకుంది. ఇలాంటి చారిత్రక విషయాన్ని కూడా తల్లక్రిందుగా వ్రాసి కవి రాజకీయాల్లో తనకున్న అజ్ఞానాన్ని బైట బెట్టుకొన్నాడు.)

నరసయ్య అనే మరో కమ్యూనిస్టు తన భార్య శశిని వీధుల్లోకి వెళ్ళి పార్టీ పత్రికలమ్మమని బలవంతం చేస్తాడు. అందుకా గృహిణి అంగీకరించదు. ఇంతటితో నీకూ నాకూ తెగ తెంపులే అని నరసయ్య బెదిరిస్తాడు. వినయ విధేయతలు గలిగిన ఆ హిందూ పతివ్రత సతికి పతికంటె గతిలేదుకదా అని తలవంచి దుఃఖంతో తప్పక అంగీకరిస్తుంది. కాని, ఎటువంటి నీతి నియమాలులేకుండా విదేశ సభ్యతను పట్టుకొని పాకులాడే కమ్యూనిస్టుల్ని తన మనస్సులో తెగ తిట్టుకుంటుంది. అతి చురుకుగలది కాబట్టి ఆమెకు అల్పకాల్పంలోనే పార్టీ నియమాలన్నీ పట్టుబడతాయి. మరో సీనులో భర్త జబ్బుచేత నానాబాధలు పడుతూవున్నా తనకు అత్యవసరమయిన పార్టీపనివుందని భర్తకేమాత్రం సహాయం చేయకుండానే వెళ్ళిపోతుంది. "కుళ్ళుకంపు గొట్టే నీమంచం దగ్గిర నేను కూర్చోనుపో" అంటుంది. మొదట అంత వినయ విధేయతలతో భర్త అడుగులకు మడుగులొత్తే శశి చివరకంత కటికి కసాయిగుండె గలదిగా తయారవుతుంది.

తర్వాత యింకో సీనులో సుందయ్య పాకిస్తాన్ సమస్యనుగురించి ఉపన్యసిస్తూ వుంటాడు. విడిపోయేహక్కు అంగీకరించడం వల్లనే సౌభ్రాతృత్వం ఏర్పడుతుందని సోవియట్ రష్యాని ఉదాహరణగా చూపె

దతాడు. ఇంతలో ఒక ధైర్యశాలి అయిన యువకుడులేచి సుందరయ్యను ఎదిరించి యిలా మాట్లాడుతాడు.

"స్వయం నిర్ణయసూత్రాన్ని సోవియట్‌రష్యా ప్రకటించింది. నిజమే - కాని వెంటనే అదొక పెద్దఎత్తుఅని అన్నిదేశాలు గ్రహించి ప్రకటించాయి. అదీగాక అఖిల సోవియట్ సుప్రీంశాఖ, జి. పి. యు. అనే రహస్య పోలీసుశాఖలను నిర్మించిన రష్యా. యింకా రష్యాను తొంబది తొమ్మిది ముక్కలుగా విభజించినా, ఆ అఖిల రష్యా భద్రత కెంతమాత్రం భిన్నంరాదు....కమ్యూనిస్టుపార్టీ ఆదేశానుసారం తమ తమ భూములను వదలజాలని దాదాపు కోటిమంది రైతుల్ని అందాకాదేనికి? స్టాలిన్ అభిప్రాయములతో ఏకీభవించజాలని కోటిమంది కమ్యూనిస్టుపార్టీ సభ్యులనే తన పొట్టన బెట్టుకొన్న జి. పి. యు. భయంకరమయిన సంస్థ గాదంటావూ?"

ఈ విచిత్రమయిన అభూత పూర్వచరిత్రను రుజువుచేసుకోవడానికి తాతాగారి ఆశ్రితుడయిన యమ్. ఆర్. మసానీపేరు ఉదహరించాడు.

తర్వాత సీనులో సత్యం ప్రవేశిస్తాడు పార్టీమీద మొదట అతని కున్న అచంచల విశ్వాసం మెల్ల మెల్లగా సన్నగిల్లిపోతూ వుంటుంది. పార్టీ రాజకీయ పాలసీలో అతనికి అనేక అభిప్రాయ భేదాలుంటాయి. పార్టీ ఆదాయవ్యయాల్నిగూర్చికూడా చివరకు సందేహాలు కలుగుతాయి. "ప్రజలెవళ్లూ చందాలు యివ్వటంలేదు. కాని పార్టీ ఇదివరక్కంటే అనేక రెట్లు విపరీతంగా ఖర్చు బెడుతుంది. ఇందులోఉన్న రహస్య మేమిటా?" అని తర్కించుకుంటాడు. ఈ సందేహాన్నే క్రమక్రమంగా యింకా అనేక మంది పార్టీసభ్యులుకూడ వెల్లడిస్తారు. మొత్తంమీద, పార్టీ ప్రభుత్వా న్నుంచి లంచం తీసుకుంటుంది అనే భావం స్పష్టంగా స్ఫురిస్తుంది.

## ద్వితీయాంకం

విదేశీయ నవనాగరిక వేషధారిణియైన వెంగమ్మ రెండు పేజీల స్వగంతో ద్వితీయాంకం ప్రారంభం అవుతుంది. (నాటకంలో మొదటి నుంచి తుదివరకు ప్రతి కమ్యూనిస్టు మామూలు సాదాదుస్తులు మానేసి పాశ్చాత్యవేషాన్ని వేసుకున్నట్లు చూపెట్ట బడింది) తనకు కొత్తగా లభించిన స్వేచ్ఛాస్వాతంత్ర్య సౌఖ్యాల్ని అనుభవిస్తూ వెంగమ్మ అపరిమితానంద భరితురాలై పోతుంది. ప్రేక్షకులకు ఆమెయిచ్చిన సందేశమిది.

నీతి ధర్మములంచు పాతకంబంచూ
సృష్టి నైజగుణాన్నె చెండబోనేలా
యెలదేటి మదధాటి కెరయైనదంచూ
జగము పూపడతితో ఝగడమాడిందా
లేవిపోసీ నీతు లీనేల్రదుంచీ
అవకాశ మధుపాత్ర నందుకొనరావోయ్

వెంటనే ఈమె తన సిద్ధాంతాల్ని ఆచరణలో పెడుతుంది. తన ప్రేమదృక్కుల్ని ముందు సత్యంమీద ప్రసరింపజేస్తుంది. బిగి కౌగిలింతకై చేతులజాచి ముందుకివస్తుంది. కాని సత్యం తోసిపుచ్చి వెళ్ళిపోతాడు.

పార్టీప్రతిష్ఠఅంతా నానాటికిమట్టిపాలై పోతుందని సుందయ్యప్రాణం విసుగెత్తి పోతుంది. రాయలసీమ కరువు సహాయార్థం వసూలు చేసిన డబ్బంతా పార్టీ అపహరించి వేసిందని పత్రికలు ప్రచారం సాగిస్తాయి. పోయిన ప్రతిష్ఠను ఏదోవిధంగా మళ్ళీ రాబట్టుకోవడానికై పార్టీ పోలసీని యీవిధంగా నిర్వచిస్తారు.

"మాపాలసీని నిందించు దేశభక్తులను పంచమాంగదళమని ప్రభుత్వానికి పట్టిస్తే పీడవదలి పోతుంది. ఇక ప్రజల్లో మేమంటే బొత్తుగా గిట్టని వారిని తిండిదొంగలని దుమ్మెత్తిపోస్తే యికమనకెదురుండదు.

పార్టీఫండు వసూలు చేయడానికి కమ్యూనిస్టులెట్టి మోసపుటెత్తులు వేస్తారో మరో సీనులో చూపబడింది.

"వెంగమ్మ:—(ఉపన్యాస ధోరణిలో) నిర్ధనిక పక్షానరష్యాహోరాహోరీగా పోరుతుంది. అందుకే దీన్ని ప్రజాయుద్ధమనాలిసొచ్చింది. తుదకు ప్రజాశక్తులు గెల్చితీరుతాయి. రష్యాఅంటే యేంటో తెలుసునా? యీ రష్యా ప్రపంచంలోగల అన్ని సమస్యల్ని మధించి మధించి అందరికీ సంపూర్ణస్వాతంత్ర్యాన్ని యిచ్చివేసింది. అందు మన స్త్రీలకు సంపూర్ణ స్వాతంత్ర్యంవుంది. సంఘంలో పురుషులెట్లో స్త్రీలు అట్లే తిరగవచ్చు. యిప్పుడు మన హిందూ దేశంలో చూడండి. తాళిగట్టిన మాత్రాన తలపై కెక్కి కూర్చోవడమే కూర్చోవడం! అబ్బ! యెంత నైచ్యం! యెంత హీనం! ఇచటి మన స్త్రీల విషయం చెప్పకుంటే సిగ్గుచేటు గూడాను. ఇంట్లోనుంచి కదలేందుకు లేదుగదా? అలా ప్రకృతి రామణీయకాన్ని తిల

కించేందుకు లేదుగదా? కదిలితే అనుమానం మెదిలితే అనుమానం. మన గతి వూడ్చి యెత్తిపోయడంలోనో, లేకుంటే అత్తమామలకు సేవ చేయడంలోనో, లేక పిల్లలకి వండివడ్డించడంలోనో పూర్తి అయిపోతుంది. ఇక పురుషులకేం? పూలరంగడులా వాడవాడలూ తిరిగి వస్తారు. వచ్చి వూరుకుంటారా? అది సరిగ్గాలేదు. యిదిసరిగ్గాలేదు. వొళ్లు బరువెత్తిందా అని జవాహిరీ. పైగా తామొక మహాపవిత్రుల్లాగా ధర్మపన్నాలు మొదలెడతారు. కనీసం రోజుకో అరగంటైనా పాతివ్రత్య పాఠాన్ని చెప్పకుండా వుండరుగదా. అల్లాంటి ఒక పవిత్రత పేరు జెప్పి దణ్ణంగూడా పెడతారు. యెందుకో తెలుసా? మనంగూడా అదే చాలా గౌరవమనుకొని న్యాయమైన మనహక్కుల్ని మరచిపోయి అలా తయారుగావాల్ననే. అందుకే యీధర్మపన్నాలన్నీని....రష్యాలోని మనవాండ్లు దీన్ని పూర్తిగా జయించారు. ముఖ్యంగా ప్రేమవిషయంలో యూరపు జాతుల్ని జెప్పి మరింకొకర్ని చెప్పాలి. భర్తపోతే మరోభర్త ప్రియుడు పోతే మరోప్రియుడు. ఒకరిమీద ప్రేమపోతే మరింకొకర్ని ప్రేమించొచ్చు. ఏ పురుషునితోనైనా చేయిగల్పి యెంతసేపైనా తిరగవచ్చు. ఉద్యోగాలు చెయ్యొచ్చు. వూళ్ళేలవచ్చు. వంటమనమే చెయ్యాల్ననేదేమీలేదు. అసలు వంటేచేసుకోనక్కర్లేదు. టిఫిన్ తెప్పించుకోవడంలోనె వుందిసర్దా. పురుషుల ఆస్థి పురుషలదే. స్త్రీల ఆస్థి స్త్రీలదే. ఆస్థిలేదనే బెదిరింపులు లేవు వెధవతనమనేది లేనేలేదు. ప్రత్యేకించి పునిస్త్రీ తనమూ లేదనుకోండి. యెప్పుడేకోర్కె జనిస్తే అప్పుడుదాన్ని అడ్డు లేకుండా పొందవచ్చు.... (అలాంటిస్వేచ్ఛనే కావాలని సభ్యులు చప్పట్లు చరుస్తారు) భళి భళీ! దానికి మన మందరమూ నడుము గట్టాలి. కొంతత్యాగాన్ని తప్పని సరిగా చెయ్యాలి. దానికనువైంది కమ్యూనిస్టుపార్టీయే. యీ విషయంలో కాంగ్రెసు ఎంతమాత్రమూ పనికిరాదు. కాంగ్రెసు గృహజీవనాన్ని అంటే మొగుడూ పెళ్లాము కాపురము యిత్యాదుల్ని వొప్పుకుంటుంది. మొగుడూ పెళ్లాము కాపురమంటూ యెప్పుడుందో అప్పుడు బూర్జువా భావాలున్నయ్యన్నమాటే! యీ పార్టీలో బూర్జువా భావాలు లేవు. యేపార్టీయైనా వృద్ధిచెందాల్నంటే. పార్టీ సందేశం దేశం నలమూలలా ప్రచారం చెయ్యాల్నంటే, దానికి డబ్బుకావాలి. తమ సర్వస్వమూ పార్టీకే అర్పించి పార్టీసేవ జేస్తూన్న యీసుందయ్య సత్యం గార్లకు యీ పార్టీసత్వరాభివృద్ధిని గోరుతూ యీ హారాన్ని యిస్తున్నాను."

అనిచెప్పి హారాన్ని యిస్తుంది. వెంగమ్మనుజూచి శశి మొద లయిన మిగతా స్త్రీలుకూడా తలా ఒక హారాన్ని యిస్తారు.

తర్వాత సీనులో సత్యం ప్రవేశించి మన పాలసీని ఎవరూ అంగీ రించటల్లేదనీ, మనం ప్రజలకు దూరమై పోతున్నామని సుందయ్యతో వాదిస్తాడు. ఎలాగైతేం చివరికి పాలసీని కొంత సంస్కరించడానికి సుందయ్య అంగీకరిస్తాడు.

" పాకిస్తాన్ యివ్వవచ్చుననే మాటనుతగ్గించి ముస్లిం స్వయం నిర్ణయహక్కును గుర్తించాలి అనే నినాదాన్నిస్తే అదొక అర్థంలేనిమాటై మనకు కొంతవరకు బాధానివృత్తిని గల్గిస్తుంది. ఇక నిర్భీతిగా మనం ప్రజల్లోకి పొయ్యేందుకు మేమూ " కాంగ్రెసువాళ్ళమే అని, కాంగ్రెసుకూ మాకూ భేదంలేదని .... చెప్పుకుంటూ కాంగ్రెసు నాయకుల్ని విడుదల చెయ్యాలి అనే నినాదాన్నిచ్చామా, ప్రజలు వుబ్బి తబ్బిబ్బులౌతారు. యిక ప్రభుత్వానికి మనం వ్యతిరేకులంగా కన్పించేందుకు, యీ పాడు ప్రభుత్వం సర్వనాశనకర విధానాన్ని అవలంబించింది. అలాకాకుండా ' జాతీయ ప్రభుత్వం వెంటనే నిర్మించాలి ' అని కేకేస్తే ప్రజలు ప్రమోద భరితు లౌతారు. ఇక మితవాద నాయకులందరూ ఈ అరాచకపు చర్యలకు కారణం ప్రభుత్వ దమన విధానమే అన్నారుగనుక అదీ చెప్పుకోవచ్చు. "

( ఇందులోకూడా కవి తన అజ్ఞానాన్నే బైట బెట్టుకున్నాడు. జాతీయనాయకుల్ని అరెస్టుచేసి తద్వారా ప్రజల్ని రెచ్చగొట్టి ముందు కయ్యానికి కాలు దువ్వింది ప్రభుత్వమే అని 42 ఆగస్టు 9 వ తేదీ ఉద యమే కమ్యూనిస్టుపార్టీ విస్పష్టంగా ప్రకటించింది. నాయకుల్ని అరెస్టు చేసినందుకు ప్రభుత్వాన్ని ఖండిస్తూ వెంటనే వారిని విడుదలచేయాలని ఒక్క కమ్యూనిస్టుపార్టీయే మొదటినుంచి తీవ్రమయిన ప్రచారం గావించింది. )

## తృతీయాంకం

రామయ్య అనే ఒక దేశభక్తుడింటికి సుందయ్య వెళ్ళతాడు. రామయ్య భార్య లక్ష్మమ్మ చక్కని రూపసి. లక్ష్మమ్మను సుందయ్య తన వల్లో వేసుకోవాలనుకుంటాడు. అందుకోసం మొట్టమొదట ఆమెను మెల్లగా పార్టీలోకి లాక్కోవాలని చూస్తాడు. పాశ్చాత్య నవనాగరికత నెంతో కొనియాడుతాడు.

కమ్యూనిస్టు వ్యతిరేకుల నగ్నస్వరూపం

" తలప తాళిని గట్టిన ధవుడె దైవ
సముడంచును చింతించు జడత విడిచి
స్వేచ్ఛసై ్వరవిహారంబు సేయగను పె
పడమరన్ గల్గు సభ్యత పడతిమిన్న "

అని ప్రబోదిస్తాడు. మహిళా సంఘానికి అధ్యక్షురాలినిగా చేస్తాననే ఆశకూడా కొలుపుతాడు. ఎన్ని ఎత్తులువేసినా ఆమె సుందయ్య వల్లో పడదు. పైగా ముఖంవాచేటట్లు చీవాట్లు పెడుతుంది. కమ్యూనిస్టులకు నీతి నియమాలు లేవంటూ చెడబడదిట్టి మహిళాసంఘాన్ని రద్దుచెయ్యడం చాలా మంచిదని చెప్పుతుంది.

ఇంతలో రామయ్యకూడా వస్తాడు. బెంగాల్ కరువునిధికి సహాయం చేయమని సుందయ్య రామయ్యాని అడుగుతాడు. అందుకు రామయ్యా రాయలసీమ కరువుపేర వసూలుజేసిన చందాలన్నీ హరించారని పత్రికలు గోలెడుతున్నాయి. ముందు దానికి సమాధానం చెప్పమంటాడు...." తిరిగి యీ గుమ్మంకడ నా కెన్నడు కన్పించవలదుసుమా ? అట్లు కన్పించిన కుశలముండదు " అని రామయ్యా గట్టిగా వార్నింగ్‌యిచ్చి సుందయ్యాను పంపించేస్తాడు.

దీని తరువాత దృశ్యంలో సుందయ్యా తనచేతిలోని చందాడబ్బాను మోగిస్తూ బజారులో నుంచుని బెంగాల్ కరువు పాటపాడుతూవుంటాడు. ఒక్కళ్లూ ఒక్కదమ్మిడీ యివ్వరు. ప్రజలకింత సాహసమా అని తల పంకిస్తాడు. వీళ్లు ఇవ్వకపోతే లెక్కఏమిటి నాకు డబ్బుకేం తక్కువ ? అనుకుంటాడు. కాని ఈ రహస్యం ( తనకు డబ్బు వచ్చేమార్గం ) పార్టీ సభ్యులందరికి ఎక్కడ తెలిసిపోతుందో అని ఒక కొత్తఉపాయం ఆలోచిస్తాడు. తనమాటకు జవదాటని కొంతమందిచేత ( వారి లాభాన్ని వారికి చూపించి ) కొంత ఆస్తిని పార్టీకి జమకట్టిస్తాడు. దీన్నిజూచి యింకా కొందరు ఉద్రేకపరులు తమ ఆస్తుల్నికూడా యిచ్చేస్తారు.

( ఈ నాటకంలోవున్న పాటలన్నీ కమ్యూనిస్టు పాటలకు నకలే. కమ్యూనిస్టు పాటల్లోవుండే భావాలకు బదులు అసభ్య బావాలుమాత్రం ప్రవేశ పెట్టబడినవి )

ఉదాహరణకు పడవపాటతీసుకోండి :

పడవెళ్ళిపోవుచున్నదీ ఐక్యతా పడవెళ్ళి పోవుచున్నదీ
అన్ని జాతులవారి కందుతుందీ పడవ
స్వయం నిర్ణయసూత్రం చాటుతుందీపడవ ॥పడవెళ్ళి॥

ఆహార కరువునూ దాటుతుందీ పడవ
జాతీయ ప్రభుత్వం చేరుతుందీ పడవ ॥పడ॥

ఇంతటి మంచిపాట వెంగమ్మ నాటకంలో యే స్వరూపం తీసుకుందో చూడండి.

పడవెళ్ళి పోవుచున్నదీ-ఓ-బాబులార-పడవెళ్ళి పోవుచున్నది.
రంగూ రంగూల పడవ రమ్యమైనా పడవ ॥పడ॥

ఏజాతివారలైనా ఎక్కవచ్చు నీ పడవ
జాతిలోనె భేదంబుల చాటి చూపు నీపడవ ॥పడ॥

అందాల పడవలోన ఆకలంటు కాదు బాబు
ఆకలేంటి తనివిదీరు ఆలింగనాలు బాబు ॥పడ॥

టిక్కట్లు జోషివద్ద తీసుకోండి దానితోపె
స్వయం నిర్ణయ హక్కును సంపాదించిన యట్లె ॥పడ॥

## చతుర్థాంకం

సత్యం సోవియట్ రష్యాను గురించి ఉపన్యసిస్తూ వుంటాడు. "దేముడులేడూ గీముడూలేడు. పాపంలేదు పుణ్యంలేదు. ఇదంతా భాగ్యవంతులు పన్నిన వల....రష్యాలోమాదిరిగా పీడితవర్గమంతా ఏకమై పీడించేవర్గాన్ని వధించి సింహాసనాన్ని కాజేయడమే కర్తవ్యం," ఇంతలో సభ్యుల్లోనుంచి ప్రశ్నపరంపరలు కురుస్తాయి. సత్యం నిరుత్తరుడై నివ్వెరగంది చూస్తూవుంటాడు. టపటపా గడ్డలు పడతాయి. అంతటితో సత్యం పార్టీపాలసీ శుద్ధ అనర్థదాయకమని గ్రహించి తనసభ్యత్వానికి తప్పకుండా రాజీనామా యిచ్చివేయాలసిందే అనుకుంటాడు.

నాలుగో రంగంలో ఎర్రజెండాలు చేతబట్టి సుందయ్య, నరసయ్య, శశి, వందనములు పాడుతూ ప్రవేశిస్తారు.

కమ్యూనిస్టు వ్యతిరేకుల నగ్నస్వరూపం

" పుణ్యభారతభూమి పుత్రులందరిలోన
వీరాధి వీరులౌ వీరజోదులపైన
విర్రవీగెడి బంట్లమూ—ప్రజలార
యెవరమో మేము తెలుసా ॥పుణ్య॥

దేశీయ భావాల్ని తెంచివెన్వెంటనే
కూలీల రాజ్యాన్ని గుర్తించవలె మీరు
కూలీలె రష్యలోనా—ప్రజలార
కోరి చేసిరి రాజ్యమూ ॥పుణ్య॥

పొగలలో మరలలో పొగిలేటి మావంతు
పొరపాటులే దిందు పోయిందిరా తీరి
పగదీర్పు కాలమొచ్చెకా—ప్రజలార
వగగుంద నేల రండు ॥పుణ్య॥

తొగరువాతెర సొగసు తొయ్యలులతో మీరు
కులుకుతూండే రోజు కూలి పోయిందిరా
అప్పగించండి మాకూ—ప్రజలార
తప్పకా సౌఖ్యాలను ॥పుణ్య॥

రారండి రారండి రైతుబాబుల్లార
కూలీల రాజ్యాన్ని గుర్తించగా మీరు
కూలీల దేశాలనూ—ప్రజలార
కోరియేల గలారలూ ॥పుణ్య॥

కాదంచు రాదంచు వాదులాడిన మీరు
కార్మేడ్ల కోపంబు గ్రక్కు దల్చును భూమి
యెరిగుండి బ్రతకవలెనూ—ప్రజలార
వేరుపాయము లేదికకా ॥పుణ్య॥

రైతులమీదికి ఉసికొల్పి వ్యవసాయ కూలీల్ని తన వైపు తిప్పుకోవాలని సుందయ్య ప్రయత్నిస్తాడు. కాని ఆ ప్రయత్నం కూడా విఫలమౌతుంది. రైతుల కేలాటి అధికారాలు ఉండవు గాబట్టి "కూలిరాజ్యం కావాలి" అనే నినాదం పనికి రాదని రైతులు వ్యతిరేక మౌతారు. రైతు

లిచ్చేకూలిని ధాన్యరూపంలో గాకుండా డబ్బురూపంలో తీసుకోండి అని కూలీల కుదోబ్ధిస్తాడు. కాని అందుకు కూలీలు కూడా అంగీంరించరు. ఈవిధంగా సుందయ్య ఉభయభ్రష్టుడై రెంటికి జెడ్డ రేవడి అవుతాడు.

## పంచమాంకం

వెంగమ్మ మాసిన గుడ్డలతో గదిలో మూల్గుతూ పడివుంటుంది. ఆమె దగ్గిరున్న నగలూ డబ్బు యిదివరకే సుందయ్య కిచ్చివేస్తుంది. రోగంతో బాధపడుతూవున్న ఆమెకు పార్టీఆఫీసులో తలదాచు కోవడానికి కూడా కమ్యూనిస్టులు అవకాశమీవ్వరు. గతిలేక నిస్సహాయ స్థితిలోకండ్లు తిరిగి బజారులో పడిపోయిన ఆమెకు రామయ్య తన ఇంట్లో ఆశ్రయ మిస్తాడు.

పార్టీపాలసీ అసంతృప్తికరంగా ఉందని సత్యం తన సభ్యత్వానికి రాజీనామా యిచ్చివేస్తాడు. క్రమక్రమంగా చాలామంది సభ్యులకు పార్టీ మీద సందేహాలెక్కువవుతాయి. ఈ 'పరిస్థితుల్లో. ఏంచెయ్యాలా?' అని సుందయ్యకూడా ఏమీతోచక కొంచెంసేపు ఆలోచనలో పడతాడు. రైతాంగాన్ని ఏలాగయినా పార్టీవైపు ఆకర్షించాలని కిరసన్ఆయిల్, అగ్గిపెట్టెలు, పంచదార మొదలయినవి పంచే కార్యక్రమం తీసుకోమని సుందయ్య తన అనుచరులకి ఆర్డరిస్తాడు. (పైజెప్పిన వస్తువుల్ని పంచమని గవర్నమెంటు కమ్యూనిస్టుల చేతికిస్తుందట) సుందయ్య తన అనుచరుల్ని ప్రజల్లో ఏవిధంగా ప్రచారం చేయమంటున్నాడో చూడండి.

"ఇలా మీకు (ప్రజలకు) కావాలసిన వస్తువు లిప్పించకుండా కాంగ్రెసువాళ్ల నిస్పృహతో కూర్చున్నారు. మేం చెప్పాం. కాని వాండ్లు మీమంచిని కోరడమేలేదు. దేశసేవంటే యిదిగాని కాంగ్రెసువాళ్ళు చూపించే నిస్పృహకాదు. ఇంకా మేము ఆరవ నంబర్లు యేడవ నంబర్లు తీయించేశాం. బుడమేరు, కొల్లేరు గోగులమ్మేరు మొదలయిన యేర్ల స్కీములన్నీ యేర్పాటుచేశాం. దానితో మెట్టంతా మాగాణై పోతుంది- ఇదేంటి? మీరు కాస్త మావెనకమూలవుంటే చాలు ఇంకా యెంతైనాచేస్తాం.

ఇక సుందయ్య వర్కర్లకిచ్చే సలహాలుకూడా చూడండి. "ఇదిగో నోరెత్తేరైతుల్ని, రైతునాయకుల్ని, తిండిదొంగలనీ, పంచమాంగదళమనీ, పట్టిచ్చే కార్యక్రమం మాత్రం మరువవద్దు. జాగ్రత్త! అ........మరచాను.

ముందీ సత్యాన్ని రామయ్యనూ పంచమాంగదళ సభ్యులని ప్రచారం చేయండి. పార్టీకి అతడు రాజీనామా యివ్వలేదు. మేమే అతని తిరుగు బాటు భావాల్నిజూచి వెళ్ళగొట్టామని చెప్పండి.

ఆఖరి దృశ్యంలో భారతీయ సభ్యతావేషంతో వెంగమ్మ రాట్నం వడుకుతూ వుంటుంది. సత్యం రామయ్యలుకూడా అక్కడికివస్తారు. కమ్యూనిస్టు వ్యతిరేకతే యీ ముగ్గురినీ ఏకంచేసింది. కమ్యూనిస్టుపార్టీ నుంచి తానెందుకు బైటికివచ్చాడో సత్యం యీ క్రింది గద్యపద్యాల్లో యీ విధంగా చెప్పుతున్నాడు.

" ఈ భారత కమ్యూనిస్టు లనబడు జోషీముఠా కార్యక్రమంలో
అరయగ మార్క్సుజెప్పిన సమంచిత పద్ధతిగానరాదు, లో
దరచ లెనిను మహోదయు సుధర్మ పథంబునులేను, రష్యలో
జరిగిన కమ్యునిస్టఖిల పక్ష మొసంగిన దెద్దిలేదు. దు
ర్భరమగు జోషిపార్టి ఘనభైరవ నిస్వనముల్ వినూత్నముల్.

యిట్టి వీరినీచమైన పాలసీతో విసివి,

తమ దుర్నీతిసహించలేక ప్రజలత్యంతంబు కోపించ నీ
కుమతుల్ వారల రంగ గ్రూపులనియున్ క్రూరాత్ములా సోషలి
స్టులముఠా వారని బోసుపార్టియని తిట్టన్ జూతురేగాని స
త్యము నొక్కింతయు గాంచజాలరనఘా స్వార్థంబుపై నేచుటన్

యీ విధముగా యెదురుతిరిగిన ప్రజలపై కత్తిగట్టు తమ పాలసీతో పార్టీ నాశనమౌటయేగాక దేశమునకు తీరని నష్టము గల్గుచుండుటనుజూచి సహించలేక పోవుటచేతనూ,

ఆరాటించితి పార్టివృద్ధికయి దుర్వ్యాపారముల్ మానగా
నూరుల్ జెప్పితి చెవ్వి నిల్లుగొని యెన్నోరీతులన్ గాని బల్
ఘోరం బాయధికారవర్గమున కీ గోడేమియున్ లేమి క
న్నారం గాంచి యనర్థమంచెరిగి సభ్యత్వంబు బో నాడితిన్ "

వెంగమ్మపాడిన తుమ్మెదపాట యెటువంటిదో చూడండి.

పాడవే పాడవే తుమ్మెదా మంచి
పాటలెన్నోపాడు తుమ్మెదా

కమ్యూనిస్టులనంగ తుమ్మెదా వారు
కటికి రక్కసులమ్మ తుమ్మెదా
స్నేహితుల నెత్తినే తుమ్మెదా వారు
చేతులెడతారమ్మ తుమ్మెదా
నమ్మినట్టీవార్ని తుమ్మెదా వారు
నరకంలో తోస్తారు తుమ్మెదా
దేశమేమైనాను తుమ్మెదా పట్టి
దీ ద్రిమ్మరీండ్లకో తుమ్మెదా
పార్టివృద్ధియె వార్కి తుమ్మెదా బాగ
పట్టింది పిచ్చగా తుమ్మెదా
వెర్రికుక్కలుబోలె తుమ్మెదా వార
లెగశారు ప్రజపైకి తుమ్మెదా
అణచికొట్టారమ్మ తుమ్మెదా ప్రజలు
ఆవేశవివశులై తుమ్మెదా
వూరుకోలేదమ్మ తుమ్మెదా వార
లుద్దండు లయ్యారె తుమ్మెదా
కర్రలను చేబూని తుమ్మెదా ప్రజల
గల్లంతుగాజేసి తుమ్మెదా
మంచి వక్తలనెల్ల తుమ్మెదా పంచ
మాంగదళమనిచెప్పి తుమ్మెదా
ప్రభాదండ నీతికో తుమ్మెదా వార్ని
పాల్పడగ జేశారె తుమ్మెదా

* * *

జాగ్రత్త పడమనవె తుమ్మెదా ప్రజల
చాకచక్యంబుతో తుమ్మెదా

* * *

తిండిదొంగ లటంచు తుమ్మెదా ప్రజల
తిట్టిసాగారపుడె తుమ్మెదా

కమ్యూనిస్టు వ్యతిరేకుల నగ్నస్వరూపం

విభజించి ప్రజలనటు తుమ్మెదా వారు
వేపుకొని తింటారె తుమ్మెదా

* * *

కాంగ్రెసునునమ్మించి తుమ్మెదా వారు
కాళ్ళిరగ జూచారె తుమ్మెదా

సుందయ్య అతని అనుచరులు ఎర్రజెండాలు చేతబట్టి యీ క్రింది పాట పాడుకుంటూ ప్రవేశిస్తారు.

ఎర్రజెండా నీడ నేకమవ్వాలి
ఏకమై లోకాల నేలుతుండాలి

* * *

చక్కరాలినయట్లు చోద్యంబుగాను
బూర్జువా ప్రాణాలు పోవాలి రాలి
స్వాధీనమైనంత సర్వదేశములన్
అర్పించి రష్యాకు హారతివ్వాలి
యిది ప్రజాయుద్ధమని యెరుగ జెయ్యాలి
యెదురాడ ఫాసిస్టు నెగురవెయ్యాలి
తిండిదొంగలనెల్ల తిట్టికొట్టాలి
కొట్టి మనవారలకు కొల్లబెట్టాలి.

సత్యం రామయ్యలవైపు క్రూరంగా జూస్తూ సుందయ్య పంచమ స్థాయిలో 'పంచమాంగదళం' అనంగానే మిగతా కామ్రేడ్సందరూ 'పాతిపెట్టాలి' అంటారు.

ఈ విధంగా నాటకం సమాప్తమవుతుంది.

—౦౦౦—

# కమ్యూనిస్టులంటే ఎవరు?

కమ్యూనిస్టుల్ని గురించి, వారి నాయకుడు సుందరయ్యను గురించి, వారిరాజకీయ నైతిక సిద్ధాంతాల్ని గురించి, నైతిక ప్రవర్తనను గురించి ఆంధ్రదేశములో ఎంతనీచమైన దుష్ప్రచారం జరుగుతుందో పైనుదహరించిన వెంగమ్మ నాటకాల్నిబట్టి తేలికగా ఊహించుకోవచ్చు. అసలీ కమ్యూనిస్టులెవరో? ఎక్కడనుంచివచ్చారు? వారి ఉద్యమ స్వభావమెట్టిది? సిద్ధాంతాలేమిటి? ఏలక్ష్యంకోసం పని జేస్తున్నారు? వారికార్యక్రమ మేమిటి? ఆచరణ విధానమెట్టిది? వెంగమ్మనాటకంలో వట్టి ముండల ముఠాకోరు అబద్ధాలకోరు దగాకోరుగా చిత్రింపబడిన యీ సుందరయ్య ఎవరు? ఈ ప్రశ్న లన్నింటికీ కొద్దిలోనే సమాధానం యిచ్చే మార్గమొకటుంది. ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ చరిత్రకి సుందరయ్య జీవితచరిత్రకి మొదటినుంచి అవినాభావ సంబంధముంది. సుందరయ్య జీవిత చరిత్రలోనే ఆంధ్రపార్టీ చరిత్ర కూడా గర్భితమైయుంది. కాబట్టి సుందరయ్య జీవితచరిత్రను మనం ఒక సారి అవలోకిస్తే మొత్తం ఆంధ్రపార్టీ చరిత్రంతా మన కవగతమౌతుంది.

గాంధీజీ నాయకత్వంకింద జరిగిన స్వరాజ్య పోరాటాలు సమస్త భారతవర్షాన్ని ఆసేతుహిమాచలం ఊపివేశాయి. ఈ నవయుగ ప్రభాత సమయంలోనే ఆంధ్రదేశంలోకూడా ఒక నూతన సంచలనం కలిగింది. మారుమూలలోనున్న పల్లెటూళ్ళల్లో సైతం దేశభక్తి చిందులు దొక్కింది. రైతుయువకుల్లో ఒక నూతన సంచలనం బయలుదేరింది. నూతనోత్తేజం కలిగింది. చైతన్య వంతులైన యీ యువకులు జాతీయోద్యమంలో అగ్రగాములై నిల్చి ప్రశంసాపాత్రమైన ధైర్యసాహసాల్ని ప్రదర్శించారు. దేశానికి తమ సర్వస్వం ధారబోశారు. విద్యావిజ్ఞాన వికాసాల్లో దిన దినాభివృద్ధినంది రాజకీయాల్లో కూడా ఆరితేరారు. మార్క్సిజాన్ని పఠించారు, జీర్ణించుకున్నారు. మన సాహితి, సంస్కృతి, విద్య, విజ్ఞానం పెంపొందాలంటే సర్వసంపదలతో తులదూగుతూవుండే స్వతంత్ర భారత భూమిలో స్వతంత్ర విశాలాంధ్ర రాష్ట్రనిర్మాణమే ఏకైక శరణ్యమని గుర్తించారు. దానికే తమ జీవితం అంకితంచేశారు. ఈ నవీనాంధ్ర చరిత్రకు పరిపూర్ణ ప్రతిబింబమే సుందరయ్య జీవితచరిత్ర. కాబట్టి ఈయనవైపు ఒకసారి మనదృష్టిని మరల్చుదాం.

(3)

ఈయన నెల్లూరు జిల్లాలో ఒక ధనికరైతు కుటుంబంలో పుట్టాడు. బాల్యంలోనే వివేకానంద రామతీర్థుల ఉత్తమ సందేశాలను ఆకలింపు చేసుకున్నాడు. గాంధీమహాత్ముని దేశ సేవాదీక్షతో ఉత్తేజితుడయినాడు. కందుకూరి వీరేశలింగం, కొమర్రాజు లక్ష్మణరావు, చిలకమర్తి లక్ష్మీనరసింహం మొదలయిన ఆంధ్రమహాపురుషుల సాహితీవికాసంతో, సాంఘిక చైతన్యంతో తన ఆంధ్రాభిమానాన్ని పెంపొందించు కొన్నాడు.

తన పదునాలుగో ఏట మద్రాసు కాంగ్రెసు మహాసభను సందర్శించాడు. సైమన్ కమీషన్‌ను నిరాకరిస్తూ చేసిన హర్తాళలోనూ, ప్రదర్శనాలలోనూ, పాల్గొన్నాడు.

కాలేజీలో చేరాక మరికొందరు తోడి విద్యార్థులూ, తనూ, కలసి సోదర సమితి అనే ఒక సాంఘిక సేవా సమితిలో చేరారు. ఆ విద్యార్థి యువకులకు తమ తెలుగు దేశమంటే అమితమైన అభిమానం. సాంఘిక దురాచారాలను రూపుమాపి, ఒక నూతనాంధ్ర దేశాన్ని నిర్మించాలని వారి పట్టుదల. రాజకీయాలను అవగాహన చేసుకున్నారు. సెలవుల్లో తమ తమ గ్రామాలలోని రైతులకు సేవచేసేవారు. క్రమంగా వారికి సోషలిస్టు భావాలతో పరిచయం కలిగింది. రష్యాను గురించి కొన్ని పుస్తకాలు చదివారు. దౌర్జన్యాన్ని దోపిడీని సమూలంగా నాశనం చేసిన రష్యన్ విప్లవాన్ని తెలుసుకున్నారు.

1930 జనవరిలో స్వాతంత్ర్య దినోత్సవంనాడు లయోలా కాలేజీ నుంచి మదరాసు బీచికి 200 మంది విద్యార్థులతో బ్రహ్మాండమైన ఊరేగింపు సాగించారు. అక్కడ స్వాతంత్ర్య దినోత్సవంలో పాల్గొన్నారు.

తర్వాత సుందరయ్య, కంభంపాటి సత్యనారాయణ ( సీనియర్ ) గార్లు చదువుమానేసి పల్లెటూళ్ళకు వెళ్ళి రైతు కూలీ సంఘాలను నిర్మించి ప్రజాసేవ చేయడానికి నిశ్చయించుకున్నారు.

తినడానికి తిండీ, కట్టడానికి బట్ట లేక అల్లాడుతున్న కూలీలకు కూలి పెంచాలనీ, ధనికరైతులు తమ లాభాలను తగ్గించుకోవాలనీ ప్రబోధము ప్రారంభించాడు సుందరయ్య పల్లెటూళ్ళలో.

వేమన జయంతినాడు హిందూ రైతులకూ, హరిజనులకూ కలిపి ఒకవిందు ఏర్పాటుచేసాడు. గ్రామంలో ఇదొక పిడుగులాంటివార్త. ధనిక రైతులు ఎలాజరుగుతుందో చూస్తామని దౌర్జన్యానికి పూనుకున్నారు. గాంధీగారి పంథాలో విశ్వాసం వున్నవాడు కనుక వారి హృదయ పరి

వర్తనం కోసం సుందరయ్య రెండురోజులు నిరశన దీక్షపూనాడు. అప్పటికి ఆయన వయస్సు 17 సంవత్సరాలు.

1930 ఏప్రిల్‌లో సుందరయ్య తక్కిన 'సోదరసమితి'వారితోకలిసి పశ్చిమ గోదావరిజిల్లా సత్యాగ్రహశిబిరంలోచేరారు. అక్కడ తననిరంతర కృషికీ, నిర్మాణాత్మక జీవితానికీ సుందరయ్య అందరి ఆదరాభిమానాలను పొందాడు. శిబిరంలో 'ఫిజికల్ ఇన్‌స్ట్రక్టరు' గా నియమించబడ్డాడు.

తరువాత ఆయనను అరెస్టుచేసి, రెండేళ్ళు శిక్ష విధించింది ప్రభుత్వము. కాని బాలుడవడంవల్ల బోర్‌స్టల్ స్కూలుకు పంపారు. అక్కడ రాజకీయ ఖైదీల దుర్భర పరిస్థితులకు అసమ్మతి సూచకంగా నాయకత్వం వహించి రెండుసార్లు నిరశనవ్రతాలు నడిపాడు.

1932 ఉద్యమం నాటికి సుందరయ్య వ్యవసాయ కూలీ సంఘాలను నిర్మిస్తూ, అస్పృశ్యతా నివారణోద్యమంలో హరిజనులకు నాయకత్వం వహించి, అగ్రవర్ణ హిందువుల ఆగ్రహావేశాలను సహించి, పబ్లిక్ బావులనుంచి హరిజనులచేత నీళ్ళు తెప్పించాడు.

పందొమ్మిదేండ్లు నిండీ నిండకముందే ఆయనను కార్మిక, హరిజనసేవకుడుగా జిల్లాకాంగ్రెసు నాయకులు గుర్తించారు. ఆయన శక్తిసామర్థ్యాలను గుర్తించే కొంతకాలం పల్లెపాడు పినాకినీ సత్యాగ్రహాశ్రమ నిర్వాహకత్వం అప్పగించారు.

1933 లో హరిజనోద్యమ సందర్భంలో గాంధీగారు ఆంధ్రదేశ సంచారం చేసినపుడు కాంగ్రెస్ వలంటీరు సంస్థకు సుందరయ్య డిప్యూటీ ఆఫీసరుగా పనిచేసాడు.

ప్రజలయందలి ప్రేమ, నిరంతర సేవాదీక్ష ఆయనను కమ్యూనిస్టు పార్టీలోకి తీసుకువచ్చాయి. ఆయన 1932 లోనే కమ్యూనిస్టుపార్టీలోచేరాడు.

శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొన్న విద్యార్థియువకులు ఉద్యమం విఫలం కావడంతో నిరుత్సాహ పడ్డారు. 1933–36 లో జైళ్ళలో టెర్రరిస్టులతో సంబంధం పెట్టుకున్నారు. స్వాతంత్ర్య సాధనకు దౌర్జన్యవాదం (టెర్రరిజం) స్వీకరించారు. టెరరిస్టు కార్యక్రమానికి ప్లానులు వెయ్యడం ప్రారంభించారు.

ఉద్వేగపరులైన ఈ యువకులతో చర్చించి, టెర్రరిస్టు విధానం లోని లోపాలను వివరించి, వారిని కమ్యూనిస్టు పంథాకు తిప్పిన వారిలో సుందరయ్య ఒకడు. ఆయనే 1934లో ఆంధ్రదేశంలో కమ్యూనిస్టుపార్టీని

స్థాపించాడు. ఆసంవత్సరమే ఆయన రాష్ట్రకాంగ్రెసు కమిటీసభ్యుడుగాను, అఖిలభారత కాంగ్రెస్ మహాసభకు ప్రతినిధిగాను ఎన్నుకోబడ్డాడు.

కమ్యూనిస్టుపార్టీ కార్మిక రక్షణ సంఘాలను, కార్మిక సంఘాలనూ నిర్మించ నారంభించింది. 1929–30 లోనే కాంగ్రెసు కేంద్రాలయిన నెల్లూరు, గుంటూరు, కృష్ణా జిల్లాలలో రీసెటిల్‌మెంటు పన్ను రద్దుచెయ్యాలని రైతులలో జరిగిన ఆందోళన ఒక రూపం పొందడం మొదలు పెట్టింది. ఆసమయంలో ప్రజలంతా కాంగ్రెసు వెనుక వున్నారుగదా అనే తృప్తితో కడుపులోచల్లకదలకుండా కూర్చున్నారు. అప్పుడు సుందరయ్యా రైతుయువకులతోకూడిన పార్టీసభ్యులుమాత్రమే స్వతంత్రంగా రైతువుద్యమాన్ని నిర్మించారు. 1500 గ్రామాల్లో రైతులకు చైతన్యం కలిగిస్తూ, ఇచ్ఛాపూర్‌నుంచి మద్రాసుకు 1500 మైళ్ళ రైతు రక్షణయాత్ర నడిపింది కూడా వీరే. ఈ యాత్రతో రైతుఉద్యమం అభివృద్ధి చెందింది. పల్లె ప్రాంతాల్లో చైతన్యం పెంపొందింది. అసెంబ్లీ యెన్నికలలో కమ్యూనిస్టు పార్టీ కాంగ్రెసు అభ్యర్థులను బలపరిచింది. పల్లెపల్లెకూ వీధివీధికి స్వాతంత్ర్యసందేశాన్ని తీసుకుపోయింది. ఆంధ్ర రైతాంగాన్ని కాంగ్రెసుకు అండగా నిలిపింది.

కాంగ్రెసు నాయకులు మంత్రివర్గాలకు వెళ్ళారు. కాంగ్రెసులోని కమ్యూనిస్టు యువకులు ప్రజల్లోకి వెళ్ళారు.

గ్రామాల్లో పెత్తందార్లకూ, దోపిడీగాండ్రకూ వ్యతిరేకంగా రైతులను సమీకరించారు. కాళీపట్నంలోను, మునగాలలోను కమ్యూనిస్టు రైతునాయకులు జమీందార్ల దుండగాలకు, పోలీసు దౌర్జన్యాలకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన పోరాటాలు నడిపారు.

ఈ పోరాటాలను చూచి మితవాద కాంగ్రెస్ నాయకులు చీదరించుకున్నారు. కాని, సుందరయ్య నాయకత్వాన, కమ్యూనిస్టులు రైతుల్లో స్వాతంత్ర్య చైతన్యాన్ని పెంపొందిస్తూ, రైతు సంఘాలను నిర్మిస్తూ రైతు పోరాటాలను నడుపుతూ, తమ కర్తవ్యాన్ని నిర్వహించారు.

సుందరయ్య సేవానిరతిని, శక్తి సామర్థ్యాలను కాంగ్రెసువారు ప్రశంసించేవారు. 1938 లో 39 లో ఆయనను అఖిల భారత కాంగ్రెస్ కమిటీకి ఎన్నుకొన్నారు.

1939 లో యుద్ధం ప్రారంభం కాగానే, ప్రభుత్వం దేశమంతటా కమ్యూనిస్టులను అరెస్టు చెయ్య నారంభించింది. అప్పుడు సుందరయ్యను

కూడా అరెస్టు చెయ్యాలని ప్రయత్నం. కాని సుందరయ్య చిక్కలేదు. పోలీసులు వెదకి వెదకి వేసారారు. సాధ్యమైన ప్రయత్నాలన్నీ సాగించారు. సుందరయ్యను పట్టిస్తే వెయ్యి రూపాయిలిస్తామనీ, 15 వందలిస్తామనీ ప్రకటించారు. కాని లాభం లేకపోయింది. రహస్య జీవితంసాగిస్తూ సుందరయ్య తక్కిన కామ్రేడ్సుతో తమ తమ కార్యక్రమాలను కొనసాగించుకుంటూనే వచ్చారు. 'స్వతంత్ర భారత్' అనే రహస్య కమ్యూనిస్టుపత్రికను నడిపారు. ఖచ్చితమైన పార్టీ నిర్మాణాన్ని కాపాడుకున్నారు.

రహస్య కాలంలో ఒకసారి కామ్రేడ్ సుందరయ్య మార్మగోవా - గుంటకల్లు రైలులో ప్రయాణం చేస్తున్నారు. పశ్చిమ కనుమలలో వున్న 'లోండా' స్టేషనులో రైల్వేపోలీసులు అరెస్టు చేసారు పుస్తకాలు వున్నాయని కష్టమ్సు అధికారులు కేసు పెడతామన్నారు. దీన్ని పోలీసులు గుర్తించారా అంటే యీ కేసుతోనేపోదు. సామ్రాజ్యవాదుల జైలులో మ్రగ్గాలసివస్తుంది. ప్రజాసేవ చేసే అవకాశముండదు ఏదో ఒకటి నిశ్చయించుకోవాలని సుందరయ్య బాగా ఆలోచించాడు.

సబ్ ఇన్స్పెక్టరు పోలీసులు ఇద్దరు ప్రక్కనే వున్నారు. స్టేషను ప్రక్కనే పెద్దకొండ, కీకారణ్యం. పోలీసులు ఏమో మాట్లాడుకొంటున్నారు. కామ్రేడ్ సుందరయ్య ఆ కొండవైపు, అరణ్యంలోకి పరుగెత్త సాగాడు !!

వెనుక పోలీసుల అరుపులు! వెంటబడ్డారు. కామ్రేడ్ దొరకలేదు. ఆ పొదలు చెట్లలో అదృశ్యమయ్యాడు.

మూడేండ్లు సుందరయ్య ప్రభుత్వానికి చిక్కలేదు. పోలీసులు ఆయనను చూసింది పార్టీమీద నిషేధం తొలగిన తర్వాతనే!

1942 లో పార్టీపై నిషేధం తొలగినప్పటినుండి కామ్రేడ్ సుందరయ్యకు బహిరంగంగా పనిచేసే అవకాశం లభించింది. మాతృదేశ స్వాతంత్ర్యం కోసం పాటుబడటం ఆయన జీవితలక్ష్యం. అట్టి మాతృదేశంపైకి జపాన్ దుండగీడులు రానున్నారు. వారి దురాక్రమణనుండి మాతృభూమిని రక్షించాలి. ఫాసిస్టులనుండి రానున్న లోక విపత్తును అరికట్టాలి. తద్వారానే భారతీయుల స్వాతంత్ర్యోద్యమం బలపడుతుందనే ఆశయంతో పనిచేసాడు. ఆంధ్రదేశమంతటా రైతు కార్మికోద్యమాలు విస్తరించాయి. రాయలసీమ తెలంగాణ ప్రాంతాలలో ప్రజా ఉద్యమాలు బలపడి ఆంధ్రజాతి నానాట వృద్ధిచెందుతూంది.

తన 17 వ సంవత్సరంనుంచి ప్రజాసేవ చేస్తున్న దేశభక్తుడు కామ్రేడ్ సుందరయ్య తన ఆస్తినంతటినీ ప్రజాసేవకే అర్పించిన త్యాగి.

ఈ ప్రపంచయుద్ధంలో జర్మనీ జపానులు ఓడిపోవాలని మిత్ర మండలికే జయం కలగాలని మనం కోరాం. ఒకవైపు యుద్ధంలో మిత్ర మండలికి జయం కలగాలంటూ మిత్రమండలి యుద్ధ ప్రయత్నాల్నే కుంటు పరచడం ఎంత అవివేకమో ఆలోచించండి. 'మిత్రమండలికే యుద్ధంలో జయం కలగాలి అని మనం కోరుతున్నప్పుడు మనంకూడా ఆ యుద్ధానికి తోడ్పడాలి.' అని కమ్యూనిస్టుపార్టీ చెప్పింది. కాని దీనిని కాంగ్రెసు నాయకులు పెడచెవిని బెట్టారు. రాబోయే 'ఉద్యమం' లో కమ్యూనిస్టులు కూడా పాల్గొనకపోతే వారికి సర్వనాశనం తప్పదు అని కాంగ్రెసు పెద్దలు భావించారు. కాని పాపం వారి ప్లానులన్నీ తల్లక్రిందులయ్యాయి. కమ్యూనిస్టులు సర్వనాశనంకాలేదు సరేకదా ఎన్నోరెట్లు ఎక్కువగా బలపడ్డారు. ఈ జాతీయ సంక్షోభదశలో పార్టీగాని ప్రజాసంఘాలుగాని యెంత బల పడ్డాయో చూడండి.

## పార్టీ, ప్రజాసంఘాల అభివృద్ధి

| | సభ్యత్వం | |
|---|---|---|
| | (సంక్షోభానికి ముందు) 1942 | 1945 |
| పార్టీసభ్యులు | 796 | 7000 |
| ట్రేడ్‌యూనియన్‌సభ్యులు | 10,000 | 40,000 |
| రైతుసంఘంసభ్యులు | 60,000 | 1,70000 |
| వ్యవసాయకూలీసంఘంసభ్యులు | 10,000 | 30,000 |
| యువజనసంఘంసభ్యులు | 10,000 | 20,000 |
| మహిళాసంఘంసభ్యులు | 3000 | 15,000 |
| విద్యార్థిసంఘంసభ్యులు | 6000 | 9000 |

ఇంతకొద్దికాలంలో ఇంత త్వరగా పార్టీ ఎలా అభివృద్ధిచెందింది? ఇందులోవున్న రహస్యమేమిటి? కాశేశ్వర్రావుగారు జెప్పినట్లుగా కాంగ్రెసు నాయకులు జైళ్ళల్లోవున్నప్పుడు పార్టీ ప్రజల్ని మోసగించి తన బుట్టలో వేసుకుందా? ఈ విషయాలన్నీ పూర్తిగా తెలుసుకోవాలంటే కమ్యూనిస్టు పార్టీ యీ సంక్షోభదశలో యేమిచేసిందో ఒకసారి వెనక్కుతిరిగిచూడటం అవసరం.

# కమ్యూనిస్టులు - ఆగస్టు ఘటనలు

ఆగస్టు తీర్మానానికి పూర్వమే కమ్యూనిస్టులు ఆంధ్రదేశమంతటా జాతీయవాంఛా దినోత్సవం ( National demand day ) జరిపారు. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గం ప్రవేశపెట్టిన జాతీయ వాంఛా తీర్మానాన్ని ప్రజలందరూ ఎందుకు బలపరచాలో ప్రతి మీటింగులో వివరించి చెప్పారు. జపాను ఫాసిస్టులు సరిహద్దున పొంచికూర్చున్న సమయంలో పోరాటమనే బెదిరింపుద్వారా మన జాతీయవాంఛని సాధించలేమనీ, కాంగ్రెసు లీగు ఒడంబడికమీద ఆధారపడిన జాతీయైక్యతద్వారానే సాధించగలమనీ మరో విధంగా అసాధ్యమనీ కాంగ్రెసు నాయకులకు విజ్ఞప్తిచేశారు. స్వయం నిర్ణయ హక్కును గుర్తించి కాంగ్రెసు లీగు ఐక్యతకై పాటుపడటమే ప్రధాన కర్తవ్యమని వాదించారు. అయినప్పటికి బొంబాయిలో ఆగస్టు తీర్మానం ప్యాసయింది. కమ్యూనిస్టులిచ్చిన హెచ్చరికను గుర్తించలేదు. ఆ తీర్మానంలోని పోరాటభాగాన్ని అవకాశంగా తీసుకొని ప్రభుత్వం వెంటనే మన నాయకుల్ని అరెస్టుచేసింది అంతటితో రంగా అనుచరులు, ఫార్వర్డ్‌బ్లాక్, సోషలిస్ట్ పార్టీలకు చెందినవారు రహస్యంగా పనిచేయ నారంభించారు. కాంగ్రెస్ పేరు నుపయోగించుకుంటూ విధ్వంసక చర్యల్ని జరపవలసిందని ప్రజల్ని పురికొల్పారు. జపాను అనుకూల ప్రచారం సాగించారు. ఇటువంటి పరిస్థితుల్లో ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ తన కర్త వ్యాన్ని నిర్వహించవలసి వచ్చింది.

## (అ) రాజకీయాందోళన

నాయకుల అరెస్టునుగురించి, కాంగ్రెసుపై విధింపబడిన ఆంక్షను గురించి ఆంధ్ర కమ్యూనిస్టు లానాడే విధంగా భావించారు? కాంగ్రెసు నాయకులు జైళ్ళలో ఉన్నారు గాబట్టి తమ పార్టీని బలపర్చుకోవడానికి ఒక చక్కని అవకాశం దొరికిందిగదాఅని సంతోషించారా? లేదు. యావద్భారతదేశం నేడొక ప్రమాద పరిస్థితిలో పడిపోయిందని స్పష్టంగా గుర్తించారు. 12-8-42 తేదీన ప్రజాశక్తి యిలా వ్రాసింది.

"కాంగ్రెసుపైన ఫాసిస్టు వ్యతిరేకులపైన ప్రభుత్వ నిర్బంధ ప్రయోగం ఆగిపోవాలి. ఇందుకు ప్రజలందరూ ఐక్యమై తీవ్రాందోళన గావించాలి. ఇంతేగాదు. దేశరక్షణ కార్యాలను, జపాన్ వ్యతిరేక యుద్ధ

ప్రయత్నాలను అభివృద్ధిగావించడానికి అందరూ ఐక్యమైకృషిచెయ్యాలి.... "జాతీయ నాయకు లందరినీ జైళ్ళనుండి విడిపించడానికి ప్రజలు ఐక్య కంఠంతో ఆందోళన గావించాలి" ........ "కాంగ్రెసుపై ప్రభుత్వము నిర్బంధమును ప్రయోగించుటవలన యేర్పడ్డ విషమపరిస్థితులను ఎదు ర్కోవడానికి కమ్యూనిస్టులు కృషిచేస్తారు."

వీలయితే బహిరంగసభలద్వారా, లేకపోతే గృహసమావేశాలద్వారా తీర్మానాలద్వారా ప్రభుత్వ మవలంబించిన దమన నీతిని ఖండిస్తూ పార్టీ యావత్తూ సర్వశక్తులూ ఉపయోగించి పనిచేసింది. ఉభయ పక్షాలనుంచి వచ్చే ఒత్తిడికి ఇబ్బందులకు గురియై విధ్వంసకచర్యలు స్వరాజ్య సాధక ములు కాకపోగా యెలా హానికరమో ప్రజల్లో తీవ్రంగా ప్రచారంచేసింది. విధ్వంసక చర్యలు కాంగ్రెసు కార్యక్రమంకాదనీ కాంగ్రెసు మొదటినుంచీ ఫాసిస్టు వ్యతిరేకసంస్థే అనీ, దేశరక్షణను బలహీనపరచే పనులు చేయడం వల్ల అమెరీ ముఠాకు మంచి అవకాశమిచ్చిన వాళ్ళం అవుతామనీ పార్టీ అనేకమందికి నచ్చజెప్పింది.

ఒక వైపునుంచి దేశభక్తుల కోపానికీ, మరోవైపునుంచి ప్రభుత్వ దాడికి పార్టీ గురిఅయింది.

భీమవరంలో (పశ్చిమ గోదావరిజిల్లా) ప్రభుత్వ ఆఫీసులమీదికి ప్రజలు దాడి సల్పారు. పోలీసు కాల్పులు సాగించింది. సోమరాజు అనే కమ్యూనిస్టు వెంటనే ఒక పిట్ట గోడపైకెక్కి ప్రజల్ని రెచ్చిపోయి పిచ్చి పనులు చేయవద్దని ఉపోద్ఘాతిస్తూ వుండగా ఆగ్రహావేశ పరవశులైన ప్రజలు అతన్ని క్రిందికి లాగి కొట్టారు. కాని పోలీసుమాత్రం వెంకట రామరాజు అనేస్థానిక కమ్యూనిస్టు. నాయకుణ్ని అరెస్టుచేసి కేసుబెట్టింది. వెంకట రామరాజుకు 20 కొరడాదెబ్బలు, రెండు సంవత్సరాలు కఠినశిక్ష విధింప బడింది.

మూడు సంవత్సరాల రహస్యకాలంలో పోలీసుల చేతికి చిక్క కుండా వాళ్ళని ముప్పతిప్పలుబెట్టి గుంటకు గుక్కెడు నీళ్ళ తాగించారు కమ్యూనిస్టులు ఇప్పుడా కసితీర్చుకోడానికి పోలీసులకు మంచి అదును దొరికింది.

ఆచంటలో (పశ్చిమ గోదావరిజిల్లా) ముగ్గురు కమ్యూనిస్టులమీద తీగెలు తెంచారని టక్కరికేసులు బనాయించారు. కొరడాదెబ్బల శిక్షతో పాటు ఒక సంవత్సరం కఠినశిక్షకూడా విధింపబడింది.

రేపల్లె మొదలయినచోట్ల ముఖ్యంగా కమ్యూనిస్టులే ఆగ్రహోదగ్రులైన ప్రజలమధ్య నిలబడి రైలుస్టేషను తగలబెట్టకూడదనీ, రైలుపట్టాలు పీకెయ్యగూడదనీ అప్పీలుచేశారు. అలా అప్పీలుచేసినవారిలో ఒకరైన పి. లక్ష్మీనారాయణగారిమీద విధ్వంసకచర్యలు జరిపాడని నేర మారోపింపబడింది. క్రిందకోర్టు శిక్షకూడా విధించింది కాని అప్పీల్లో కేసు కొట్టేశారు. లక్ష్మీనారాయణ అతని అనుచరులు విధ్వంసక చర్యలు జరగకుండా ఆపుజేయడానికి ప్రయత్నించార" ని కోర్టు తీర్పు జెప్పింది.

అనంతపురం కాలేజీ లేబరేటరీని తగలబెట్టారని ముగ్గురు కమ్యూనిస్టు విద్యార్థులమీద, యిద్దరు పార్టీ ఆర్గనైజర్లపైన కేసు పెట్టబడింది. కాని ముద్దాయిలు నిర్దోషులని కోర్టులో కేసు కొట్టివేయబడింది.

యీ విధంగా కమ్యూనిస్టులపని ఆనాడు అడకత్తెరలో వక్కలాగా తయారయింది.

కమ్యూనిస్టులు నిర్దోషులని కోర్టులో తీర్పుజెప్పిన కేసులు బహుకొద్ది. ఎక్కువమందికి శిక్షబడింది.

## ఆగస్టుఘటనల్లో శిక్షింపబడిన కమ్యూనిస్టులసంఖ్య

| | | |
|---|---|---|
| 1. | గుంటూరు | 75 |
| 2. | పశ్చిమగోదావరి | 75 |
| 3. | కృష్ణ | 50 |
| 4. | అనంతపురం | 8 |
| 5. | కడప | 20 |
| 6. | తూర్పుగోదావరి | 20 |
| 7. | విశాఖపట్టణం | 20 |
| 8. | కర్నూలు | 15 |
| 9. | నెల్లూరు | 12 |
| 10. | చిత్తూరు | 6 |
| | మొత్తం | 301 |

ఆంధ్రరాష్ట్రం మొత్తంలో అరెస్టుచేయబడిన కాంగ్రెసువాదులు సుమారు రెండువేలమంది వుంటారు. ఆనాటికున్న 796 పార్టీసభ్యత్వంలో 301 మంది - అనగా దాదాపు సగంమంది - అరెస్టు అయ్యారంటే

కమ్యూనిస్టు వ్యతిరేకుల నగ్నస్వరూపం

కాంగ్రెసుతోపాటు కమ్యూనిస్టు పార్టీకూడా గవర్నమెంటు నిర్బంధ విధానికి గురి అయిందని వేరే చెప్పాలా ?

తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, గుంటూరు, కడప, కర్నూలు జిల్లాల్లోను, యింకా అనేక ప్రదేశాల్లోను పార్టీ ఆఫీసులు, రైతుసంఘ ఆఫీసులు పోలీసుల దాడికి గురి అయ్యాయి. జెండాలు బోర్డులు చిన్నాభిన్నం చేయబడ్డాయి. పార్టీసాహిత్యం పట్టువడింది.

పార్టీసభ్యులు రైతుసంఘువర్కర్లు చల్లపల్లిఏరియాలో ఐక్యతా ప్రచారం చేస్తూవుండగా పోలీసులు పట్టుకొని దారుణంగా కొట్టారు. దివి తాలూకా రైతుసంఘ కార్యదర్శి రాధాకృష్ణయ్యగారు నాయకుల విడుదలను గురించి సంతకాలు చేయిస్తూవుండగా పోలీసులు అతన్ని అరెస్టుచేసి అతని దగ్గరున్న మెమోరాండం లాక్కొని దానిమీద సంతకాలుచేసిన వారి నందరినీ కొట్టారు.

ఇవి మచ్చుకు కొన్ని ఉదాహరణలుమాత్రమే. కమ్యూనిస్టులమీద ప్రయోగించిన ఆనాటి నిర్బంధ విధానంలో యిదిఒక స్వల్పాంశం. యీ పరిస్థితులలో కాశేశ్వరరావుగారుగానీ, రంగాగారుగానీ, లేక పండిట్ నెహ్రూగానీ కమ్యూనిస్టులు 'రెండోపక్షం' లో కలిసి పొయ్యారంటే ప్రతిరోజూ కమ్యూనిస్టుల్ని, వాళ్ళ కార్యకలాపాల్ని కండ్లారజూస్తూవున్న ఆంధ్ర ప్రజానీకం ఏలా నమ్ముతుంది ? కమ్యూనిస్టు లెవరిపక్షాన ఉన్నారో, ఎవరికోసం పనిచేస్తున్నారో, ఆంధ్ర రైతుకి వేరే చెప్పనవసరంలేదు.

మా రాజకీయ ప్రచారంవల్లను, కార్యాచరణ విధానం వల్లను, కాంగ్రెసు వాదులు క్రమక్రమంగా విధ్వంసక చర్యలనుంచి తమదృష్టి మరల్చారు. గాంధీ లిన్‌లిత్‌గో లేఖలు బైటపడినతర్వాత విధ్వంసక చర్యల్ని బహిరంగంగా ఖండించసాగారు. ఇన్నాసుంచి ఏ. ఐ. సి. సి. కేంద్ర కార్యనిర్వాహక వర్గమనే పేరుతో రహస్యంగావుండి యీ నాటక మంతా ఆడిన సోషలిస్టుపార్టీ నిజస్వరూపం బైటపడింది.

శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు 1943 ఆగస్టులో యిలా ప్రకటించారు.

" కాంగ్రెసు తరపున ప్రాతినిధ్యం వహించే కేంద్రకమిటీ ఎక్కడో వుండి పని సాగిస్తున్నదని ప్రజలు అపోహ పడుతున్నారు. అలాంటి కమిటీ ఉనికి యధార్థంగా తెలియదు. ఏదయినా ఉన్నట్లు

యితే అది శాస్త్రీయంగా నిర్మించబడిన కమిటీకాదు. కాంగ్రెస్ తరఫున ప్రాతినిధ్యం వహించుటకు అర్హతగల కమిటీ కాదని యిందుకు సంబంధించిన వారి క్షేమంలో నేను స్పష్టంచేస్తున్నాను. దేశక్షేమం కొరకు సేవచేయగోరుతూవున్న ప్రతిపౌరుడు ఇలాంటి సంస్థల ప్రాబల్యంలో పడిపోకుండా వుండాలి."

ఈ విధంగా కమ్యూనిస్టులు అటు ప్రభుత్వ దమన విధానానికి ఇటు ప్రజల విధ్వంసక చర్యలకి వ్యతిరేకంగా పెద్ద ఆందోళన సాగించారు. కాంగ్రెసు వాదుల్లో పాకిస్థాను సమస్యనుగురించి లీగు ప్రజల్లో కాంగ్రెసు నాయకుల విడుదలను గురించి ప్రచారం చేశారు.

గాంధీజీ విడుదల సమయంలో లక్షలకొలదీ హిందూ-ముస్లిం ప్రజలను సమీకరించి గాంధీజీ విడుదలకై ఆందోళన జరిపారు. స్వయం నిర్ణయ సూత్రానికి వ్యతిరేకంగా హిందూ మహాసభ సాగిస్తూ వున్న ప్రచారం యెంత బేసబబో సకారణంగా రుజువు చేసి చూపెట్టారు.

ఈలాటి నిర్మాణ కార్యక్రమంద్వారా కమ్యూనిస్టులు కాంగ్రెసును బలహీన పరచలేదు సరేగదా దాన్ని యింకా యెంత బలపరిచారో కొంచె మాలోచించిన ప్రతివారికి తేలికగా తెలుస్తుంది.

## (ఆ) జీవితావసరవస్తువులకోసం కమ్యూనిస్టులు చేసినకృషి

రాజకీయ సంక్షోభం శీఘ్రకాలంలోనే ఆహార సంక్షోభానికి, ఆర్థిక సంక్షోభానికి దారితీసింది. ధరలు రెట్టికి రెట్టి పెరిగిపోయాయి. ధరల్ని కంట్రోలు చేయవలసిందనీ, చౌకడిపోలు వెంటనే తెరవవలసిందనీ కమ్యూనిస్టుపార్టీయే ముందుగా ఆందోళన జేసింది. కాకినాడ, బెజవాడ, గుంటూరు, తెనాలి మొదలయిన బస్తీలలో చౌక డిపోలు తెరచిందాకా స్థానికాధికారులకు ఊపిరి ఆడనివ్వకుండా పనిచేసింది. ధాన్యాన్ని సరస మయిన ధరలకందించే నిమిత్తం రాయలసీమలో సహకార సంస్థల్ని ఏర్పాటు చేయవలసినదిగా పార్టీ ఆందోళన గావించింది. దొంగమార్కెటులో బస్తా ( 3 మణుగులు )-35, 40 రూపాయలు అమ్ముతూవుంటే యీ చౌకడిపోలద్వారా బీదప్రజలకు రూపాయికి 4 సేర్లు చొ॥ అందించ గలిగింది. పంచదార, కిరసన్ పంపకం కూడా తన చేతుల్లోకే తీసికొని చాలాచోట్ల దొంగవర్తకుల ఆటకట్టించింది.

## వ్యవసాయ కూలీ రంగం

యుద్ధపరిస్థితులవల్ల మధ్యతరగతి ప్రజల పనే అంతంతమాత్రంగా వుంటే యిక వ్యవసాయ కూలీల గోడు వేరే చెప్పాలా? అక్టోబరు నెలకే వాళ్ళు నిలవజేసుకున్న గింజలు కాసినీ అయిపోతాయి. అంతటితో ఏదో విధంగా పొట్టబోసుకోవడం కోసం భూస్వాముల దగ్గిరనుంచి అప్పులు సప్పులు, తీసుకుంటారు. అప్పు దొరికితే చాలురా దేవుడా బతికిపోతాం, అని కడుపు కక్కుర్తికోసం రూపాయికి రూపాయి వడ్డీ కయినా అంగీక రిస్తారు. కాని మళ్ళీ యీ అప్పుతీర్చేదెట్లా? కమ్యూనిస్టు రైతు వర్కర్లు యిందులో మార్పు తీసుకరావడానికి కృషిసల్పారు. ధాన్య నిధిని ఏర్పాటు చేశారు. రైతాంగంలో అణగివున్న దేశభక్తిని ఉత్తేజపరచి ధనికరైతు లకు నచ్చజెప్పి వడ్డీలేకుండా ధాన్యనిధికి ధాన్యాన్ని పోగు చేశారు. దున్ను కోవడానికేమీ భూమిలేని కూలీలకే బంజరు భూములిచ్చేటట్లు ప్రభుత్వం మీద ఒత్తిడి తెచ్చారు. ఈ భూముల్ని మీరాక్రమించుకోవద్దని రైతులకు విజ్ఞప్తి చేశారు. రైతు కూలీ సంఘాలద్వారా అనేక గ్రామాల్లో రైతుకూలీ సామరస్యాన్ని నెలకొల్పారు. అనేక వందల సంవత్సరాలనుంచి మనిషి మనిషిమధ్య అవాంతరాలు కల్పించి మానవ సమాజాన్ని అధోగతికి తీసు కుపోతూవున్న సాంఘికాచారాల్ని సంస్కరించడానికి ధైర్యంగా ముంద డుగులేస్తున్నారు.

## రైతు సేవ

అధికంగా పంటలు పండే ప్రదేశంలోని రైతుల్లో పార్టీ దేశభక్తిని రేకెత్తించింది. మీసోదర ప్రజలు కరువు కాటకాల్లో జిక్కి తిండి లేక నానాబాధలు పడుతున్నారనీ, మీకుటుంబ ఖర్చులకు సరిపోగా మిగిలిన ధాన్యాన్ని అన్నార్తులకు అందజేయవలసిందనీ పార్టీ ప్రబోధించింది. న్యాయమయిన ధరలు మాత్రమే రాబట్టుకోవాలిసిందనీ, దొంగమార్కె టులో లభించే అక్రమమయిన అధిక ధరలకు ఆశపడి బీదసాదల్ని కరువు రాక్షసివాతపడవేయవద్దని రైతాంగంలో ప్రచారం చేసింది. పేరాసల్ని అరికట్టింది. గవర్నమెంటు ధాన్యపుబస్తాధర 9–14–0 మాత్రమే నిర్ణ యిస్తే ఇది రైతాంగానికి హానికరమని అంకెలు అక్షరాలతో సహా రుజువు చేసి ఆందోళనసాగించింది. రైతులు కష్టపడి పండించేధాన్యానికి బస్తా 1కి

పదకొండు రూపాయలు న్యాయమయిన ధరగా నిర్ణయించవలసిందని ప్రభుత్వము మీద ఒత్తిడి తెచ్చింది. ఈ ఆందోళన ఫలితంగా గవర్నమెంటు ధాన్యపు బస్తాధరను రు 9-14-0 నుంచి 10-8-0 లకు పెంచింది. ధాన్యానికి కంట్రోలు ధరను నిర్ణయించడం రైతులకే లాభదాయకమని నచ్చచెప్పింది. ధరల్ని కంట్రోలు చేయడంవల్ల మధ్య అధిక లాభాలు పొందే దళారీలే నష్టపడతారు కాని రైతాంగం కాదు" అని సవిస్తారంగా తెలియజెప్పింది. ధాన్యసేకరణయొక్క ఆవశ్యకతను రైతులచే గుర్తింప జేసింది. ధాన్యసేకరణ పేరుతో బీదరైతుల్ని బాధపెట్టి వారికుటుంబఖర్చులకు కూడా మిగల్చకుండా ఎక్కువ ధాన్యాన్ని వసూలుచేసే ఉద్యోగస్థుల నిరంకుశ చర్యల్ని ఎదిరించింది. దురాగతాల్ని అరికట్టింది.

పండిన పంటలు చాలక బాధపడే ప్రదేశాల్లో రేషనింగ్ వెంటనే అమలుపరచ వలసిందని పై అధికారులమీద ఒత్తిడి తెచ్చింది. రేషనింగ్ అంటే అదివరకు ప్రజల్లో పాతుకుపోయిన అపోహల్ని తొలగించింది. రేషనింగ్ అమలు పరచేటప్పుడు ప్రజాసామాన్యానికి అన్యాయం జరగకుండా చూచింది. లెక్కలు సరిగ్గా తీయడానికి తోడ్పడింది. కష్టించి పని జేసే శ్రమజీవులకు సరిపోయేఅంత రేషన్ ఇప్పించడానికి ప్రయత్నించింది.

అవసరమయిన చెరువులన్నీ వెంటనే మరమ్మతు చేయించడం, కట్టలు బోయించి వాగులకు బంధాలు కట్టించడం. మొదలయిన సమస్యల్ని తీసుకొని జమీందారీ ప్రదేశాల్లో ప్రచారంజేసింది. జమీందార్లు బుద్ధిపూర్వకంగా యీ పనులకు పూనుకోకపోతే గవర్నమెంటే మరమ్మతుచేయించి అయిన ఖర్చుల్ని జమీందారు బొక్కసంనుండి వసూలు చేయవలసిందని ఆందోళన గావించింది. ప్రభుత్వంమీద తగినంత ఒత్తిడితెచ్చి ఇర్రిగేషన్ వర్క్సుయాక్ట్ ప్యాస్ చేయించింది. అవసరమయిన మరమ్మతులు చేయించకుండా స్థానికాధికారులు టలాయిస్తే రైతులే స్వయంగా నడుంగట్టి తమకు కావలసిన పనులు తమంతట తామే చేసుకొనేటట్లు రైతాంగాన్ని ప్రోత్సహించింది.

జమీందారీ ఏరియాలో వుండే సాగుచేయని భూముల్ని రైతులకి దున్నుకోవడాని కివ్వవలసిందని ప్రచారంచేసింది. దున్నుకోవడానికి రైతులకిస్తే ఆ భూమిమీద తమకున్న హక్కులు ఎగిరిపోతయ్యేమో అని జమీందార్లు భయపడి రైతులకు భూములివ్వ నిరాకరించారు. జమీందార్లకున్న యీ భయాన్ని పోగొట్టడానికి ఎస్టేట్స్‌ల్యాండ్ యాక్ట్ సవరించ

వలసిందని రైతుసంఘాలు అనేక సభలు జరిపి తద్వారా ఆందోళన సాగించాయి. చివరకు గవర్నమెంటు లొంగివచ్చింది. చట్టాన్ని సవరించింది. ఇందువల్ల 20 వేల ఎకరాలభూమి అధికాహారోత్పత్తికింద కొత్తగా సాగులోకి తీసుకు రాబడింది.

## కాలువలు తవ్వటం

పొలాలకు సరిపోయే అంత నీరు సమృద్ధిగా లభించడానికి కృష్ణ కాలవలోని ఒండుమట్టి తవ్వితీసే బాధ్యత పార్టీయే స్వయంగా తీసుకుంది. స్వయం సహాయోద్యమానికి యీ పనిద్వారా పార్టీ శంఖుస్థాపనచేసింది. వెయ్యిమంది పార్టీసభ్యులు 35 రోజులు నిరంతరం పరిశ్రమచేసి యీ విధంగా కాలవతవ్వటం ఆంధ్ర రైతాంగంలో ఒక నూతన ఉత్సాహాన్నీ ఉల్లాసాన్నీ కల్పించింది. స్వయంసహాయోద్యమానికి ఇది ఉన్నత భావ ప్రేరితమయిన ఒక ఉజ్వల ఉదాహరణ. సరిగ్గా 35 రోజుల్లో తొమ్మిది మైళ్ళ పొడుగు కాలవతవ్వి సాఫీజేశారు. ఇందువల్ల 15000 ఎకరాల భూమి అదనంగా సాగుచేయడానికి అవకాశ మేర్పడింది. ఇదివరకున్న పొలాలకుకూడా నీరు సమృద్ధిగా లభ్యమయింది. ఈ సంవత్సరంలో యీ నీటితో యింకా 30,000 ఎకరాల మెట్టభూమిని సేద్యంలోకి తీసుకు రావచ్చు. ఈ కార్యం జయప్రదంగా నెరవేరడంవల్ల రైతుల్లో ఎంతో ఆత్మవిశ్వాసం కలిగింది. తలబిరుసు ఉద్యోగస్థుల కృపాకటాక్షానికి, జమీందార్ల మెహర్బానీకి చాతకపక్షుల్లాగా నోరు తెరుచుకొని యెదురుచూడకుండా అత్యవసర మయిన కొద్దీ గొప్పపనుల్ని తమంతటతామే చేసుకోవడానికి రైతులు ముందుకు వస్తున్నారు. ఇప్పుడు నీళ్లు కొంతవరకు సమృద్ధిగా లభించడంవల్ల ఊడ్పుల సమయంలో ఒకళ్ళకంటె ఒకళ్లు ముందు నీళ్ళు పెట్టుకోవాలని జుట్టూజుట్టూ పట్టుకొనే పరిస్థితిపోతోంది.

## అధికాహారోత్పత్తి

కొత్తరకపు (రసాయనిక) ఎరువులు ఉపయోగించడంవల్లను, కొత్తరకపు పనిముట్లను వాడటంవల్లను, ఎక్కువపంట నెలాపండించవచ్చునో ప్రతి రైతుసంఘసమావేశంలోను చెప్పబడుతూంది. ఈ విషయం మీద ప్రజాశక్తిలో కొన్ని వ్యాసాలుకూడా వచ్చాయి. వ్యవసాయ శాఖ ద్వారా కొన్ని ప్రదర్శనాలు ఏర్పాటు చేయబడ్డాయి. ఎరువులకూ, విత్త

నాలుగుగాను 14 లక్షల రూపాయలు అప్పుగా పేదరైతులకు ఇప్పించ బడ్డాయి. వీటి అన్నిటిఫలితంగా డెల్టా ప్రాంతంలో నూటికి పది పదిహేను రెట్లు పంట అధికంగా పండుతూవుంది.

## దొంగ మార్కెట్

దొంగమార్కెట్‌ను అరికట్టడానికి పార్టీయెంతో కృషిచేసింది. రైతుల నిత్యావసరాని కుపయోగించే ఇనప పనిముట్లు (కర్రులు గొర్రులు, పలుగులు, పారలు మొదలగునవి) పంపకం సక్రమంగా జరిగేటట్లు చూసింది. రైతుసంఘాలద్వారా, సహకార సంస్థలద్వారా పంపకం చేయిం చడంవల్ల మొత్తం ఆంధ్రరాష్ట్రా కి దిగుమతి అయ్యే యినప పనిముట్లల్లో కొంతభాగం దొంగమార్కెటులోకి పోకుండా కాపాడింది.

## కరువు నివారణ

రాయలసీమలో కరువు జ్వాలలు నలుమూలలా కమ్ముకున్నాయి. తిండిలేక పస్తులు పండుకునే రాయలసీమ సోదరుల సహాయార్థం పార్టీయే ముందు చొరవచేసి పిలుపిచ్చింది. మే 10 వ తేదీని 'రాయలసీమ డే' గా నిర్ణయించింది. సభలు జరిపింది. 9 వేల రూపాయలు చందా వసూలు చేసి రాయలసీమకు పంపించింది. ఈ కృషి ఆంధ్ర ప్రజల్లో ఒక నూతన జాతీయ చైతన్యాన్ని, ఆంధ్రాభిమానాన్ని రేకెత్తించింది. తర్వాత ఆంధ్ర మహాసభ కూడా యీ కార్యానికి పూనుకొని రెండు లక్షలు వసూలుచేసి రాయలసీమకు పంపింది. ఈ ఆందోళన ఫలితంగా ప్రభుత్వంకూడా కండ్లు తెరిచింది. క్షామ నివారణ శిబిరాల్ని ఏర్పరచింది. కరువు సహాయార్థం 2 కోట్ల 75 లక్షల రూపాయల్ని ప్రత్యేకించింది.

## అంటువ్యాధి నివారణ

అంటువ్యాధులు అంతటా వ్యాపించి పోకుండా అరికట్టడానికి పార్టీయే ప్రధాన పాత్రవహించి పనిచేసింది. జబ్బులు రావడానికి కారణ మేమిటో? ముందు ఎటువంటి జాగ్రత్తలు తీసుకోవాల్నో. జబ్బులు వచ్చిన తర్వాత యేమిచేయాల్నో, వీటన్నింటిని గురించి పార్టీ రైతాం గములో ప్రచారం చేసింది. మశూచి మొదలయిన అంటువ్యాధుల్నిగురించి ప్రజల్లో వుండే అపోహల్ని మూఢవిశ్వాసాల్ని, తొలగించడానికి పార్టీ పాటుపడింది.

## కా ర్మి కు ల లో

రైల్వే, డాక్, రైస్‌మిల్ కార్మికుల్ని. మునిసిపల్ కార్మికుల్ని పార్టీయే సంఘంలోకి తెచ్చింది. ట్రేడ్‌యూనియన్ ఉద్యమాన్ని నిర్మించింది. ఆర్థిక సంక్షోభ దశలో కార్మికులకు రావాలిసిన కరువు భత్యము కోసం పోరాడింది. యుద్ధసమయంలో రాకపోకల సౌకర్యాలు దెబ్బతిన కుండా కార్మికుల్లో దేశభక్తిని ప్రబోధించి యుద్ధరంగంలో పనిజేసే కార్మికులకు, వెనక ఉన్న ప్రజలకు జీవితావసర వస్తువులు అందేటట్లుచూసింది. 'బెజవాడను శుభ్రపరచండి' అనే వినాదంతో మ్యునిసిపల్ కార్మికులు చూపించిన పట్టుదల కార్యాసక్తి బెజవాడ పౌరుల మన్ననలకు పాత్రమయింది. ఆంధ్రరాష్ట్రంలో ఉన్న కార్మికవర్గం పరిమితమే అయినా ఉన్నంతవరకు కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన్నేవుంది.

## వి ద్యా ర్థి ఉ ద్య మ ం

రాజకీయ పరిపక్వతరాని అల్పవయస్కులైన విద్యార్థులు కొందరు దేశభక్తి ప్రేరితులై "స్వరాజ్యం వచ్చిందాకా సమ్మెలు సాగాలి; విధ్వంసక చర్యలు కొనసాగాలి" అనే గంభీర 'విప్లవ' వినాదాలు ఇస్తూవుండే వారు. విద్యార్థిసంఘం వీరికి తన పోలసీని నచ్చచెప్పి, సరియైన మార్గమేదో చూపించి వీరిలో యెక్కువమంది విద్యార్థుల్ని తనవైపు ఆకర్షించింది. కిరసనాయిలు, కాగితం మొదలయిన నిత్యావసర వస్తువుల కోసం ఆందోళనసాగించింది. విద్యాసంస్థల్ని ప్రజాస్వామికంగా నడపాలని అధికారవర్గంమీద ఒత్తిడి తెచ్చింది. విద్యార్థుల్లో "బాగా చదవండి" అనే ఉద్యమాన్ని లేవదీసింది, ఉపాధ్యాయులమధ్య విద్యార్థులమధ్య సరియైన సంబంధాల్ని పెంపొందింపజేసింది. స్కూళ్ళల్లో తగినన్ని సీట్లు, వసతి సౌకర్యాలు లేక పోవడంచేత విద్యా ప్రచారమే కుంటుబడే పరిస్థితికి వచ్చింది. వెంటనే విద్యార్థి సంఘం పూనుకొని తమ తల్లి దండ్రులయొక్కయు, ఇతర పెద్దలయొక్క సహాయంతో తాత్కాలికంగా ఇంకా ఎక్కువపాకలు వేయించి విద్యాభివృద్ధికి దెబ్బ తగలకుండా యథావిధిగా స్కూళ్లునడిచేటట్లు చేసింది. ఇలాంటి దేశభక్తి ప్రపూరితమయిన సక్రమ కార్యక్రమాన్ని అవలంబించడంవల్ల ఈనాడు ఆంధ్రరాష్ట్ర విద్యార్థి సంఘం 10 వేల సభ్యత్వం గల ఒక బలమయిన సంస్థగా తయారయింది. 12 సంవత్సరాల వయస్సు

మించిన యావత్తు విద్యార్థి వర్గంలో నాలుగోవంతు ఈ రోజు విద్యార్థి సంఘంలో సభ్యులుగా ఉన్నారు.

## (ఇ) వైజ్ఞానిక కార్యక్రమం

నిరంతర కార్యాచరణవల్ల కమ్యూనిస్టు లేవిధంగా రైతులోకంలో ప్రచారం చేశారో రాజకీయ ప్రతిష్టంభన సమయంలో, కరువు సమయంలో నిస్పృహచెందకుండా రైతాంగాన్ని ఏ విధంగా ముందుకు నడిపించారో చూశాం. ఇదివరకు రాజకీయాలతో ఎటువంటి సంబంధం లేకుండా దూరంగా వుండిపోయిన అనేకమంది రైతులు నేడు ప్రత్యక్ష రాజకీయాల్లో తాముకూడా భాగస్వాములై తమ వీరోచిత పాత్రను నిర్వహించడానికి కటిబద్ధులై కార్యరంగంలో దిగారు. ఈలాంటి రైతు లందరిని రాజకీయంగా వైజ్ఞానికంగా అభివృద్ధిపరచే బాధ్యత పార్టీమీదపడింది.

19 వ శతాబ్దంలోని కడపటి దశాబ్దాల్లో శ్రీ వీరేశలింగం పంతులు గారు ( ఆంధ్ర రామమోహన్‌రాయ్ ) గురజాడ అప్పారావుగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు మొదలయిన మహామహులు ఆంధ్రభాషలో ఒక నూతనశకాన్ని ప్రారంభించారు. ఈ పునర్జాగృతినిచూచి ఆనాడు అనేకమంది నవయువకులు నూతనోత్సాహ భరితులయ్యారు. కాని దురదృష్టవశాత్తు ఆంధ్రసాహిత్యంలో వచ్చిన యీ నూతన జాగృతి 1920 తర్వాత విచ్ఛిన్న మార్గాన బడింది. రాజకీయాలు సాహిత్యం పరస్పర సంబంధం లేకుండా ఒకదాని కొకటి దూరమైపొయ్యాయి.

ఆంధ్రప్రజలు అనాదినుంచి అలవాటుపడిన ప్రాచీన వైజ్ఞానిక పద్ధతుల్నే తీసుకొని కమ్యూనిస్టులు వాటిలో నేటి జాతీయభావాల్ని జొప్పించారు. విజ్ఞాన ప్రచారానికి, వినోదానికి, దేశభక్తిని ప్రబోధించడానికి, ప్రజల్ని కార్యోన్ముఖులుగా జేయడానికి యీ చిత్రవేష ప్రదర్శనాలు అమోఘమయిన ఆయుధాలుగా ఉపయోగిస్తున్నాయి. కమ్యూనిస్టులచే నిర్మింపబడిన అభ్యుదయ రచయితలసంఘం రాష్ట్రమంతటా పేరెన్నికగన్న ఆంధ్ర సాహితీపరుల్నికూడా తనవైపు ఆకర్షించింది. డిసెంబరు 44 లో జరిగిన అభ్యుదయ రచయితల మహాసభకు మహాకవి శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారు హాజరయ్యారు. సుప్రసిద్ధ విమర్శకులు నవ్యసాహిత్య పరిషత్కార్యదర్శులు అయిన శ్రీ తెలికచెర్ల వెంకటరత్నంగారు అధ్యక్షత వహించారు. పెద్దలిచ్చే సందేశాల్ని వినడానికి, తమ బిడ్డలు

వ్రాసిన పాటలు పద్యాలు విని ఆనందించడానికి వెయ్యిమంది రైతులు కూలీలుకూడా సభకు హాజరయ్యారు. ప్రజాజీవితానికి యింకా చేరువగా వచ్చి ప్రజాసమస్యల్ని తీసికొని సాహిత్యం సృష్టించడానికి ప్రజలు కళా వేత్తల్లోను, కళావేత్తలు ప్రజల్లోను ఒక నూతన స్ఫూర్తిని రేకెత్తించారు. ప్రజలమధ్య కళావేత్తలమధ్య ఒక నవీన వైజ్ఞానిక సంబంధం ఏర్పడింది.

జాతీయ అంతర్జాతీయ సమస్యల్నిగురించి, విద్యావిజ్ఞాన వికాసాల్ని గురించి, సాహితీ సంస్కృతుల్ని గురించి ప్రజాశక్తి యెన్నో గ్రంథాలను ప్రచురించింది.

ప్రతిరైతు సభకువచ్చే వేలాది ప్రజానీకం కమ్యూనిస్టుల వైజ్ఞానిక ప్రదర్శనాలు చూస్తున్నారు. ప్రేక్షకుల హృదయాల్లో సంతోషం ఉరవళ్ళు పరవళ్ళుదొక్కుతూవుంటుంది. ఈ ప్రదర్శనాలు కేవలం వినోదానికేకాదు. ఈనాడు ప్రజల నెదుర్కొంటున్న సమస్యలేవో, వాటిని ఎలా పరిష్కరించాలో, ప్రజల కర్తవ్యమేమిటో కండ్లకు గట్టినట్టుగా తెలియజేస్తాయి. ప్రజల దోచుకొనితినే జమీందారుల షాహుకార్ల బాధలనుండి విముక్తి చెందే మార్గమేదో సూచిస్తాయి. మన ప్రాచీన విజ్ఞానాన్ని ప్రచారం చేయడానికి, తేలికగా అందరికి బోధపడే భాషలో ప్రజలకు చిరపరిచితమయిన పద్ధతులతో రాజకీయాలు నేర్పడానికి యీ ప్రదర్శనాలు ఎంత దివ్యంగా ఉపయోగిస్తున్నాయో ఈనాడు ఆంధ్రరాష్ట్రంలో మహాపండితునిదగ్గరనుంచి సామాన్య పౌరునివరకు అందరికీ తెలిసినవిషయమే. ఆంధ్రరాష్ట్రంలో యింతవరకు ఏ గ్రంథమండలి ప్రకటించనన్ని పుస్తకాలు ప్రచురించి ప్రజాశక్తి యీ విధంగా ప్రజాసేవ, భాషాసేవ చేస్తూవుంది. యుగబ్రహ్మ శ్రీ వీరేశలింగంగారు నెలకొల్పిన సత్సాంప్రదాయాల్ని యింకా ముందుకు తీసుకపోతూన్న యీ వైజ్ఞానిక పునర్జాగృతిని చూచిన సాహితీ పారంగతులు, కళా విజ్ఞాన ప్రవీణులు, దేశసేవాధురీణులు ఆనంద రసావేశ పరవశులయ్యారు.

## (ఈ) యువజనోద్యమము

ఈనాడు యువజనసంఘం యాజమాన్యాన రెండువందల గ్రంథాలయాలు నడపబడుతున్నాయి. వైజ్ఞానిక ఆరోగ్యాభివృద్ధికోసం అనేక రకాలయిన పాటల్లో ఆటల్లో పాల్గొనేటట్లుగా రైతుయువకుల్ని ప్రోత్సాహపరచింది. బాలసంఘంద్వారా బాల బాలికల్ని బాగా చదవాలనీ, యింటి

దగ్గిర ఉన్నప్పుడు తల్లిదండ్రులకు అన్నిపనుల్లో తోడ్పడాలనీ, అల్లరి పిల్లకాయలై చెడిపోగూడదనీ బోధించి చక్కని దారిలో పెట్టింది.

## మ హి ళా వు ద్య మ ము

మహిళా ఉద్యమం ఆంధ్ర మహిళాలోకంలో ఒక నూతన చైతన్యాన్ని కలగజేసింది. మహిళా సంఘ సమావేశాల్లో నేడు స్త్రీల నెదుర్కొంటున్న రాజకీయ సాంఘిక సమస్యల్ని గురించి ఉత్తమ గార్హస్థ్య జీవన విధానాన్ని గురించి చర్చలు జరుగుతున్నాయి. స్త్రీల కోసం ప్రత్యేకంగా నడపబడుతూవున్న స్కూళ్ళల్లో ప్రాథమిక ఆరోగ్య సూత్రాలు (స్వస్థవృత్తం) రాజకీయ భూగోళం. ప్రసూతి, కోళ్ళ పరిశ్రమ, ఆహార శాస్త్రం మొదలయిన విషయాలు నేర్పబడుతున్నాయి. ఇదివరకు రాజకీయాలతో ఎటువంటి సంబంధంలేని రైతుబాలికలు, రైతుభార్యలు నేడు దేశభక్తి ప్రపూరితలై జాతీయపోరాటంలో ముందంజ వేస్తున్నారు. ఆదర్శ ప్రాయులయిన గృహిణులుగా ఆత్మవిశ్వాసం గల్గి తోటి సోదరీమణుల మన్ననలకు పాత్రులవుతున్నారు. తమ కోసం తమబిడ్డల కోసం నూతన ఆంధ్రదేశాన్ని నిర్మించడానికి పురుషులకు చేదోడువాదోడుగా వుండి తమ పాత్రను పూర్తిగా నిర్వహిస్తున్నారు.

300 మంది రైతుస్త్రీలు నేడుకమ్యూనిస్టుపార్టీ సభ్యులుగాఉన్నారు. ఇందులో అన్నితరాలవారు-తల్లులనుంచి పిల్లలదాకా-వున్నారు. గుంటూరు కృష్ణా తూర్పుగోదావరి జిల్లాల మహిళాసంఘ సభ్యత్వం 20 వేలదాకా వుంది. ప్రసూతి-శిశుపోషణలకు సంబంధించిన శాస్త్రాల్లో ప్రత్యేక ప్రావీణ్యం సంపాదించిన ఆంధ్రసోదరీమణులకు సర్వవిధాలా తోడ్పడుతూవున్న డాక్టరు అచ్చమాంబగారు, (ఈమె కొమర్రాజు లక్ష్మణరావుగారి కూతురు ఆంధ్రదేశంలోని విద్యావంతుల్లో లక్ష్మణరావుగారి పేరుతెలియని వారెవరూ ఉండరు. వీరు ఆధునిక యుగపురుషులయిన త్రిమూర్తుల్లో ఒకరు. జగత్ప్రసిద్ధిగాంచిన చరిత్రకారులు. విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి సంస్థాపకులు. ఆంధ్ర విజ్ఞాన సర్వస్వ రచయితలు) "ఉన్న ఆస్థిపాస్తులు సర్వస్వం పార్టీకే ధారబోసి నిరంతరం మహిళా సమాజాభివృద్ధికై పాటు పడుతూవున్న" మానికొండ సూర్యావతిగారు, వీరిద్వరి నాయకత్వంకింద మహిళాసంఘము ఆంధ్రరాజకీయాల్లో నేడొక ప్రధాన పాత్రను నిర్వహిస్తూవుంది. రాజకీయాలకు స్త్రీ సమాజానికి ఏటువంటి సంబంధముందో

కమ్యూనిస్టు వ్యతిరేకుల నగ్నస్వరూపం

జాతీయోద్యమంలో స్త్రీలుకూడా పాల్గొని యేలా తమ కర్తవ్యాన్ని నిర్వర్తించాలో, సూర్యావతిగారి ఉపన్యాసాలు స్పష్టంగా తెలియజేస్తాయి. ఆంధ్రమాతకు అల్లారు ముద్దుబిడ్డలయినటువంటి ఆంధ్ర కమ్యూనిస్టుస్త్రీలనే 'వెంగమ్మ' అంతగా ఆడిపోసింది.

మెల్లీ షోలింగర్, (ఈమె జన్మస్థానం స్విట్జర్లాండ్. చాలాకాలం గాంధీజీ ఆశ్రమంలోవుంది. డాక్టరు ఉప్పల లక్ష్మణరావుగారి భార్య.) డాక్టరు ద్వారకాబాయి, ఇందుమతీదేవి (ఆంధ్ర కవయిత్రి) మొదలయిన విఖ్యాత విదుషీమణులు కమ్యూనిస్టుపార్టీ సభ్యులయిన అచ్చమాంబ, సూర్యావతి, చంద్ర సావిత్రి, టి. సావిత్రి, హనుమాయమ్మ గార్లతో కలిసి మహిళాసంఘాభివృద్ధికోసం కృషిచేస్తున్నారు.

## పార్టీ ఇంత అభివృద్ధి ఎలాచెందింది ?

ఇంతవరకు అన్నిరంగాల్లో కమ్యూనిస్టులు చేస్తూవున్న సర్వతోముఖ నిర్మాణ కార్యక్రమాన్ని ఒకసారి సింహావలోకనం చేశాం. ఆంధ్ర దేశంలో ఉన్న వివిధప్రజల్లో కమ్యూనిస్టులు నూతనచైతన్యాన్ని రేకెత్తించారు. తమ సేవాధర్మాన్ని నిర్వర్తించారు.

యుగకవి శ్రీ గురజాడ అప్పారావుగారిచ్చిన దివ్య సందేశాన్ని మూల మూలల నున్న పల్లె పల్లెకు తీసుకొనివెళ్ళారు.

దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్
ఈసురోమని మనుషులుంటే దేశమేగతి బాగుపడునోయ్

దైనందిన సమస్యల్ని తమంత తామే పరిష్కరించుకొనేటట్లు ప్రజల్లో ప్రబోధం చేసింది పార్టీ. అందువల్ల పార్టీగాని రైతుసంఘంగాని కేవలం రైతువర్గానికే ప్రాతినిధ్యం వహించకుండా సమస్తప్రజలకు నాయకత్వం వహించాయి. ప్రజాసేవలో ఆరితేరి ప్రజల విశ్వాసాన్ని చూరగొన్న రైతుబిడ్డలందరూ పార్టీలో సభ్యులుగా చేరారు. ఇంటిపనులు ముచ్చటగా జేసుకుంటూ సర్వస్వం త్యాగంజేసి దేశసేవకై పాటుపడుతూ వున్న తమ బిడ్డల్నిచూస్తే యే తల్లిదండ్రులకి సంతోషంగా వుండదు ? కాబట్టే పార్టీగాని రైతుసంఘంగాని యింత త్వరగా అభివృద్ధి జెందాయి. ప్రజాసేవయే యీ అభివృద్ధికి మూలకారణం. దేశభక్తినే యీనాడు ప్రజ లపేక్షించేది. విద్యావిజ్ఞానాలకు నిలయమై, సర్వ సంపదలతో తులదూగుతూవుండే స్వతంత్ర విశాలాంధ్రరాష్ట్రనిర్మాణమే అందరిలక్ష్యం.

# కాంగ్రెసునాయకుల దుష్ప్రచారం

జమీందార్ల షాహుకార్ల దోపిడీకి గురియై నానాబాధలు పడుతూ దిక్కూ-మొక్కూ లేకుండావున్న బీదసాదల భావిజీవితమార్గంలో కమ్యూనిస్టుపార్టీయే ఆశాజ్యోతిని వెలిగించింది. జమీందారీ దురంతాల్ని ఒక్క-కట్టుగా ఎదుర్కో-డానికి చెల్లాచెదరుగావున్న ప్రజలందరికీ ఒక సంఘాన్ని ఏర్పరచింది. ఒక దారికితెచ్చింది. ప్రజలుకూడా సంఘంలోవున్న బలాన్ని నానాటికి గుర్తించసాగారు. ఇక తమయిష్టంవచ్చినట్లు విచ్చలవిడిగా దోచుకోవడానికి వీలులేదని జమీందార్లు నిప్పుదొక్కి-న కోతుల్లాగా ఎగిరిపడ్డారు. సంఘాలుంటే తమ ఆటలు సాగవనే ఆదుర్దాతో అసలుసంఘాల్నే రూపుమాపడానికి కత్తిగట్టారు. మొదటిదెబ్బగా కమ్యూనిస్టులమీద దుష్ప్రచారాయుధాన్ని ఉపయోగించారు.

చల్లపల్లిరాజా చెప్పుచేతల్లో మెలగే బండిబుచ్చయ్య సంపాదకత్వాన ములుకోలపత్రిక ముందుగా యీ రొచ్చుగుంట ప్రచారానికి పూనుకుంది. జస్టీస్‌పార్టీకి చెందిన బండిబుచ్చయ్య పత్రికకు చల్లపల్లిరాజాయే ప్రధానపోషకులు. ఈ బుచ్చయ్యే సరోజినీనాయుడు నైతిక ప్రవర్తనని గురించి అనేక దుర్భాషలాడాడు. కాంగ్రెసు నాయకులు ప్రజలడబ్బు నపహరిస్తున్నారని ప్రచారంచేశాడు. ఇప్పుడు డాక్టరు అచ్చమాంబగారిని గురించి ( ఆడపిల్లల్ని తీసుకొచ్చి తనయింట్లోబెట్టి తారుస్తుందని ) పిచ్చిబూతులు వ్రాస్తున్నాడు. ఈ బూతుల పత్రికనే కొందరు సోషలిస్టులు కొందరు కాంగ్రెసువాదులు బుజాలమీద వేసుకొని తిరుగుతున్నారు.

1944 మార్చిలో అఖిలభారత రైతుమహాసభ బెజవాడలోజరిగింది. సుమారు ఒక లక్షమంది ప్రజలు సభకు హాజరయ్యారు. ' హిందూ ' పత్రికకూడా ఇదొక కాంగ్రెసు మహాసభలాగా వుందని వ్రాసింది. గడచిన 20 సంవత్సరాల్లో యింత పెద్దమహాసభ ఆంధ్రరాష్ట్రంలో ఎక్కడా జరగలేదు. ఇటువంటి కిసాన్ మహాసభనుగురించి ములుకోల పత్రిక, జాతీయపత్రికఅని పేరు బొందిన ఆంధ్రపత్రికకూడా ' కిస్-అన్ ' సభ అని అంత అసభ్యంగా పేర్కొ-న్నాయి. అంటే పరిస్థితు లెంత దిగజారిపొయ్యాయో ప్రతివారు సులభంగా ఊహించుకోవచ్చు.

కాశేశ్వరరావుగారు మొదలయిన మితవాద కాంగ్రెసు నాయకులు జైళ్ళల్లోనుంచి విడుదలై బయటికి వచ్చినప్పుడు ఆంధ్రరాష్ట్రంలో పరి

స్థితులు ఇలావున్నాయి. వారనుకొన్న ప్లానులన్నీ తల్లక్రిందులయ్యాయి. కమ్యూనిస్టులు తుడిచి పెట్టబడకపోగా పైగా యింకెంతో బలపడ్డారు. బ్రహ్మాండమయిన సభలు జరుపుతున్నారు. 1920 నాటి కాంగ్రెసుసభల ఆ ఉత్సాహం, ఆ ఆవేశం మళ్ళీ ప్రజలముఖాల్లో తాండవమాడుతూవుంది. ఇదంతాజూచి కాశేశ్వరరావులాంటి కాంగ్రెసు నాయకులకు కన్నుగుట్టింది. ఇకతమ పెత్తనం సాగదని కంగారుపడ్డారు. ప్రజలుపడే బాధలేవీ వారికి కనబడకుండా పోయాయి. కమ్యూనిస్టులతో పోరాడటమే ప్రధాన కర్తవ్యంగా దోచింది. రాజకీయంగా అభివృద్ధిజెందిన ప్రజానీకాన్ని మభ్య పరచడానికి ఒకవైపు అతివాద శబ్దజాలాన్ని వాడుతూ సామాన్యప్రజల్లో కమ్యూనిస్టులుఅంటే ద్వేషంకలగడానికి చల్లపల్లి బాకాఅయిన ములుకోల పత్రికను. వెంగమ్మ నాటకాన్ని ఆయుదాలుగా తీసుకున్నారు. ఆంధ్ర కమ్యూనిస్టు నాయకుడయిన సుందరయ్యను, బండబూతులుతిట్టింది కాబట్టి వెంగమ్మ నాటకం మంచి పదునుగల ఆయుధరాజంగా వారికి కన్పించింది. అందులోవున్న బూతుల బండారాన్నే వారు తమ ఉపన్యాసాల్లోకూడా ఏకరువు బెట్టేవారు.

## 1 కాశేశ్వరరావుగారు

వీరు అనేకమంది కమ్యూనిస్టు యువతీయువకులకు పితామహులుగా వుండదగిన వయోవృద్ధులు. 40 సంవత్సరాలనుంచి కాంగ్రెసువాదులుగా ఉంటున్నామని సగర్వంగా చెప్పుకుంటారు. బ్రాహ్మణవంశ సంజాతులు. అలాటి వీరు నేడు కమ్యూనిస్టులమీద బూతులప్రచారం చేయడానికి కూడా వెనకా ముందాడటల్లే. గాంధీగారి మనస్సునుకూడా విషపూరితం జేయడానికి వీరు గాంధీగారికి యేమని జాబువ్రాశారో చూడండి.

"కమ్యూన్‌లో (కమ్యూన్ అంటే అంతాకలసి భోజనాలు చేసే స్థలం) వారు కొన్ని నాటకాలాడేవారు. ప్రతి నాటకంలోను తుపాకి కాల్పులు, ఉరితీయడం, రక్తపాతంతో కూడుకున్న హత్యలు - కథా వస్తువులుగా వుండేవి. విద్యార్థి సభ్యుల చేతులకు ఎర్రరంగుపూసి. వారి చేత ఉరితీయించడం, హత్యలు చేయించడం జరుగుతూ వుండేది. ప్రతి రోజూ కమ్యూన్‌లో మాంసం వండించే వారు. ప్రతి సభ్యుడూ సహపంక్తిలో కూర్చొని భోజనం చెయ్యాలి. వంశ పారంపర్యంగా శాకాహారం చేసేవారు (ఉదాహరణకు బ్రాహ్మణులు, వైశ్యులు) విద్యార్థులు

మాంసం తినడమేలాగో పనిగట్టుకొని నేర్పేవారు. ఎందుకంటే దౌర్జన్య చర్యలపట్ల అసహ్యభావం పోగొట్టడానికి గాంధీ అహింసా పద్ధతులంటే పట్టుదల వహిస్తున్నాడు గనుక తాను మాంసం తినడం మొదలు పెట్టి నట్లు నాతో ఒక బ్రాహ్మణ యం. ఏ. చెప్పాడు. 20 సంవత్సరాలుగా ఖద్దరు ధరిస్తున్న ఒక వైశ్య బి. యస్. సి. తాను ఆ పాడు ఖద్దరునుంచి బైటబడి స్వేచ్ఛ ననుభవిస్తున్నట్లు చెప్పాడు. అందరూ మాంసం తిని తీరాలని ఉత్సాహంగా వాదించేవాడు అక్కడ వీరొక అవరణలో అధ్య యన తరగతులు నడిపేవారు. వీరంతా గాంధీకి, సత్య అహింసలకు, కాంగ్రెసునాయకత్వానికి, దేవునికీ, ఖద్దరుకి, గ్రామ పరిశ్రములకు పూర్తిగా వ్యతిరేకం. స్త్రీ పురుష సంబంధాల్లో విచ్చలవిడి స్వేచ్ఛాప్రవర్తన మంచి దని వారు ఉపన్యాసా లిచ్చేవారు. ఒక సమావేశంలో వారి నాయకుల్లో ఒకడు, గాంధీ ఇండియాకు దాపురించిన రస్పుటీన్ అని ప్రకటించాడు. (రష్యాలో విప్లవానికి పూర్వం జార్ చక్రవర్తి ఆస్థానంలో రస్పుటీన్ అనే దొంగ సన్యాసి ఒక డుండేవాడు. వానికి జార్‌చక్రవర్తి భార్యతో సంబంధం వుండేదని ప్రతీతి. రాజకీయాల్లోకూడా రస్పుటీన్ చాలా ప్రముఖపాత్ర వహించేవాడు. ప్రజలమీద జరిగిన అనేక అత్యాచారాల్లో వీనికికూడా కొంతభాగముంది)........వారంతా కలిసి ఎంగెల్సు రచించిన ఒకపుస్తకం చదువుతూ వుండేవారు. ఆ పుస్తకంలో ఉమ్మడి పెండ్లిండ్లు లేక జంట వివాహాలు మంచివని రాశాడు. (అనగా ఇద్దరు భర్తలు ఉమ్మ డిగా యిద్దరి భార్యల్ని కలసి అనుభవించడం) ఏకపత్నీ వ్రతం స్త్రీల స్వాతంత్ర్యాన్ని హరించడానికి బూర్జువా వర్గం కల్పించిన కృత్రిమ పద్ధ తిగా ఆపుస్తకంలో ఎంగెల్సు చిత్రించాడు ఆ విధానాన్ని ఖండించాడు.... వారు సామాన్య కాంగ్రెసువాదుల్ని ముఖ్యంగా తమకు పోటీచేస్తున్నారను కొనే విద్యార్థి వర్కర్లను రైతువర్కర్లను, యువజన వర్కర్లను పోలీ సులకు ఒప్పజెప్పించడంలో సి. ఐ. డి. లుగా పనిచేశారు. తమ వ్యతిరే కుల్ని అణచడానికి కర్రలుపయోగించి కొట్టవలసిందని రహస్యంగా వారి నాయకుడు ఉత్తరువులు పంపించాడు. దీనితోపాటు దొంగభోగట్టాయిచ్చి వారిని పోలీసులకు ఒప్పజెప్పమనికూడా ఆ ఉత్తరువులలోవుంది"

దురదృష్టవశాత్తు ఈ జాబును గాంధీగారు జోషీకి పంపించారు. దీనికి జోషీ వ్రాసిన సమాధానం ఇది.

## కమ్యూనిస్టు వ్యతిరేకుల నగ్నస్వరూపం

"కమ్యూనిజాన్ని గురించి ఏ మాత్రం తెలిసిన వ్యక్తికైనా, లేక భారతదేశంలో ఏ ప్రాంతాల్లోనైనా కమ్యూనిస్టులు చేస్తున్నపనిని చూసిన ఏ వ్యక్తికైనా—చిత్తశుద్ధిగల వ్యక్తికి—ఆలేఖ చూపిన అందులోనివన్నీ శుద్ధఅబద్ధాలని వెంటనే చెపుతాడు."

ఎంగిల్సు కమ్యూనిటీ పెండ్లిండ్లను సమర్ధించాడని కాశేశ్వరరావు వ్రాసిన పచ్చి అబద్ధాలకి సమాధానమిస్తూ గాంధీగారికి జోషీ ఇలా వ్రాశాడు.

"కాశేశ్వరరావు స్టేటు మెంటుకు ఎంతవిలువ ఇవ్వవచ్చునో అతను వేసేనింద ఎంత నిర్లక్ష్యంగా వేస్తున్నాడో, అతను ఎంగెల్సు పుస్తకానికి పూర్తిగా వక్రభాష్యం చెప్పడంలోనే తేలుతుంది. ఎంగెల్సు వ్రాసిన 'కుటుంబం, ఆస్తి, రాజ్యాంగం' అను పుస్తకం మానవచరిత్రలో పెండ్లిండ్ల పరిణామం, ఆస్థి, రాజ్యాంగం ఎలా పెంపొందుతూ వచ్చాయి అనేవి తెలుపు శాస్త్రీయ గ్రంథం. కమ్యూనిస్టు సిద్ధాంతాన్ని స్థాపించుటలో మార్క్సుకు సహచరుడయిన ఎంగెల్సు ఈ పుస్తకంలో చర్చించిన విషయ మేమిటి? పెండ్లిండ్లు రాను రాను ఏకపత్నీ వివాహాలుగా మారుతూ వచ్చాయి. సమాజం పెంపొందిన కొలదీ అంతకు పూర్వపు పద్ధతులను విడనాడుతూ వచ్చాయి. ఈ సందర్భంలోనే మానవ సమాజం శైశవావస్థలో వున్న రోజుల్లో ఒకతెగలో వుండే స్త్రీ పురుషులంతా భార్యా భర్తలుగా వుండేవారని ఆచరిత్రను ఇందులో తెలియ జేశాడు. ఎంగెల్సు కమ్యూనిటీ పెండ్లిండ్లను సమర్ధించాడనడంకన్న నీచాతినీచమయిన అబద్ధము ఇంకొకటిలేదు. ఈ అబద్ధానికి యిదేసాటిగాని మరొకటి లభించదు. ఇలా వక్రభాష్యం చెప్పడం మొదలెడితే చారిత్రక పరిశోధనే అసంభవం. పైగా ఎంగెల్సు మానవుల పెండ్లి పరిణామంలో అభివృద్ధికరమైన దశ ఏకపత్నీవివాహమని చెప్పాడు. కాశేశ్వర్రావు వక్రభాష్యం శుద్ధ అబద్ధమని రుజువుచేయడానికి ఇదొకటే చాలు"

ఈ ఉత్తరంలోనే జోషీ యింకా యిలారాశాడు.

"ఆంధ్రప్రజలముందు ఒక సక్రమ విచారణకోర్టును ఆర్గనైజ్ చేయండి. కాశేశ్వర్రావును ప్రాసిక్యూటర్ ఉపన్యాసం యివ్వమనండి. సుందరయ్యకు సాక్ష్యంకూడా అవసరంలేదు. సుందరయ్య ఒక ఉపన్యాసము మాత్రం యిస్తాడు. కాశేశ్వర్రావును, సుందరయ్యను కన్న ఆంధ్రీ మాతసంతానమే, జ్యూరీగా వుంటుంది. ఆ ప్రజలేం నిర్ణయిస్తారో జడ్జిగారిని పరిశీలించి చెప్పమనండి."

గాంధీ—జోషి లేఖలు ప్రచురింపబడిన తర్వాత కాశేశ్వర్రావు ధైర్యంగా యీ ఛాలెంజిని తీసుకోలేక పొయ్యాడు. పత్రికకు ఒక చిన్న స్టేటుమెంటును మాత్రం యిచ్చాడు.

"నేను తర్వాత ఎంగిల్సు పుస్తకం శ్రద్ధగా చదివాను. దాన్ని గురించి నా అభిప్రాయం కొద్దిగా మార్చుకున్నాను. ఈ విషయమై గాంధీ గారికికూడా తెలియ జేశాను ....కాని కమ్యూనిస్టుల దౌర్జన్యచర్యలను గురించి యీ నాటికీ నా అభిప్రాయంలో ఎటువంటి మార్పులేదు. ఇటీవల కమ్యూనిస్టుల దౌర్జన్యం యింకామించి పోయింది. అందువల్ల యీ విషయంలో ఒక్క అక్షరంకూడా ఉపసంహరించుకోను.

"జోషిచేత అబద్ధాలకోరునని పిలువబడినందుకు నేను సంతోషపడుతున్నాను. అఖిలభారత హిందూమహాసభ అధ్యక్షులయిన శ్యామప్రసాద్ గారి చక్కని సహవాసం నాకు దొరికింది"

నిజంగా కాశేశ్వర్రావులాంటివారు అభివృద్ధి నిరోధక సంస్థయైన హిందూమహాసభలో ఉండడానికే అర్హులు. ఈలాంటివారు ఉండటం వల్లనే కాంగ్రెసు కీర్తికికూడా కళంకంవస్తుంది. ఎంగిల్సు వ్రాతలకు తెగించి అపార్ధాలు కల్పించాడు. కాని తానువ్రాసినవన్నీ శుద్ధతప్పుల తడకలని తెలిసిన తర్వాతకూడా ఉపసంహరించుకోడట. కొద్దిగా సంస్కరిస్తాడట. సామాన్య మర్యాద పద్ధతుల్నికూడా పాటించడట. ప్రజల ముందుకువచ్చి సుందరయ్యమీద నేరారోపణ చేయవలసిందని జోషివేసిన ఛాలెంజ్ తీసుకోలేకపొయ్యాడు. కాని తన పచ్చి అబద్ధాల ప్రచారంమాత్రం మానలా. గోవాడ సభలో యిలా చెప్పాడు.

"గాంధీగారు సాక్షాత్తు భగవదవతారం. కమ్యూనిస్టులు భగవంతుడికీ గాంధీగారికీ వ్యతిరేకులు. కాంగ్రెసు నాయకులు జెల్లో వుండగా కమ్యూనిస్టులు బలపడ్డారు. రష్యా స్త్రీలు నీతినియమాలులేని పట్టికులటలు. మీకు గాంధీ గావాలా ? స్టాలిన్ గావాలా ? రంగా గావాలా ? సుందరయ్య గావాలా" ( సమాధానంలేదు )

## 2. కల్లూరి చంద్రమౌళిగారు

వీరికి తెనాలిలో ఎరువుల వ్యాపారంఉంది. ఎరువుల్ని నిలవజేసి దొంగమార్కెట్ ధరలకమ్మి వీరు అధికలాభాలు గడించారు. కమ్యూనిస్టులు దీన్ని బయలుపరచి ఎరువుల్ని సక్రమమైన ధరలకు ప్రజలకందిం

చారు. వీరు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అసెంబ్లీ అధ్యక్షులు. వీరిని ఆంధ్రరాష్ట్ర రైతుసంఘాధ్యక్షులు, ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ సభ్యులు మరో కమ్యూనిస్టు యీముగ్గురూ కలుసుకొని వెంగమ్మ నాటక ప్రదర్శనం మొదలయిన తప్పుడు పద్ధతుల్ని అరికట్టవలసిందిగా కోరారు. అందుకు వీరు 'వెంగమ్మనాటకంలో అభ్యంతరకరమైన విషయాలేమీలేవు. అది పూర్తిగా రాజకీయ ప్రచారం' అని సమాధానమిచ్చారు.

## 3. రంగా గారు

వీరు సెంట్రల్ అసెంబ్లీ సభ్యులు. ఇదివరకు అఖిలభారత రైతు మహాసభలో పనిచేసి యిప్పుడు దానికి పోటీ సంఘాన్ని పెట్టడానికి విపరీతమైన ప్రయత్నాలుచేస్తున్నారు. వీరు పార్టీమీదవేసే అపనిందలెటువంటివో చూడండి. జనవరి 20, 21 తేదీల్లో బందరులో జరిగిన రాష్ట్ర విద్యార్థి కాంగ్రెసు సభలో మాట్లాడుతూ యిలా చెప్పారు. "కమ్యూనిస్టు స్త్రీలు సీతాకోక చిలుకల్లాగా ఆకర్షణీయమైన దుస్తులు వేసుకొని బజార్లవెంట తిరుగుతూ ఆంధ్రమహిళాలోకాన్నే చెడగొడుతున్నారు."

బందరులో చెప్పినదాన్ని కొద్దిగా మారుస్తూ గోవాడ సభలో "కమ్యూనిస్టు స్త్రీ పురుషుల్ని ద్రౌపదీ కృష్ణుల్లాగా వుండవద్దనీ, సీతారాముల్లాగా వుండవలసిందనీ" చెప్పారు.

## 4. కల్లూరి సుబ్బారావుగారు

వీరు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అసెంబ్లీ సమావేశకర్తలు (కన్వీనర్.) కమ్యూనిస్టులు బెజవాడలో "ఫ్రీలవ్ సొసైటీ" ని ఏర్పరిచారని అనంతపురంలో ప్రైవేటు సంభాషణల్లో ప్రతివారికి చెప్పారు.

పిరికితనంవల్ల యీ అబద్ధాలకోరు దీన్ని బహిరంగంగా చెప్పలేకపొయ్యాడు. కాని ఉరవకొండ ఉపన్యాసంలో—

"రష్యాలో విప్లవమయిన తర్వాత కమ్యూనిస్టులు యితరుల పెండ్లాల్ని లేవదీసుకోని సైబేరియా పారిపొయ్యారు" అని సెలవిచ్చారు.

## 5. గొట్టిపాటి బ్రహ్మయ్యగారు

వీరు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు మాజీకార్యదర్శులు. వీరు చెప్పించిన ఒక హరికథలో— "ప్రజల్ని పార్టీలోకి ఆకర్షించడానికి కమ్యూనిస్టు స్త్రీలు మత స్తనాలమీది పైటచెంగును తొలగిస్తారు" అని చెప్పారు. పక్కనే కూర్చున్న బ్రహ్మయ్యగారు యీ మాటవిని సంతోషం పట్టలేకపొయ్యారు.

# వెంగమ్మ - జాతీయపత్రికల సమీక్ష

వెంగమ్మ ' ను గురించి ఆంధ్ర జాతీయ పత్రికల అభిప్రాయ మేమిటో చూద్దాం.

## 1. జ మీ న్ రై తు

ఇది రంగగారికి బాకాలాంటి పత్రిక. " ఇందులో ఒక కమ్యూనిస్టు నాయకుడు వెంగమ్మను లేవదీసుకొని వెళ్ళి చివరకు దాని ముఖమైనా చూడకుండా వదిలిపెట్టేస్తాడు. కమ్యూనిస్టులు ప్రజల్ని మోసగించడానికి యెన్నివేషాలు వేస్తారో, ఎన్నిరంగులు మారుస్తారో మొదలయిన విషయాలన్నీ చక్కగా చిత్రింపబడ్డాయి. ఆహా! కోటయ్యగారు (కవి) ఎంత అద్భుతమైన నాటకం తయారు జేశారు! "

## 2. ఆ ం ధ్ర ప త్రి క

ఇది దేశోద్ధారక శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి పత్రిక. ఆంధ్రజాతీయ పత్రికల్లో మొదటిది. ప్రస్తుతం కమ్యూనిస్టు వ్యతరేక కాంగ్రెసు నాయకులకు బాకా లాగా ఉపయోగిస్తూవుంది.

" ఇది అయిదు అంకాల నాటకం. కాంగ్రెసు నాయకులు జైల్లో వుండగా తమ పార్టీని బలపర్చుకోవడానికి కమ్యూనిస్టులు ఎంత నీచంగా వ్యవహరించారో యీ నాటకం చక్కగా తెలియజేస్తుంది. ఇందులో ప్రచారానికే ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వడంవల్ల నాట్యకళ పూర్తిగాలోపించింది. కాని ప్రచార సాహిత్యంలో దీనికి స్థానముంది. "

## 3. ఆ ం ధ్ర ప్ర భ

ఇది గోయెంకాగారి పత్రిక. ఇందులోకూడా ' వెంగమ్మ ' అడ్వర్టైజ్‌మెంటు ప్రకటించబడింది. " పలుకుబడికోసం ఎవళ్ళు నీచానికి పాల్పడ్డారో " కమ్యూనిస్టువ్యతిరేక నాయకులయిన రంగా కాశేశ్వరరావు ప్రభృతుల్ని ఇప్పుడు మనం అడగవచ్చు.

ఇదే ఈ కాంగ్రెసు నాయకులు, వీరి పత్రికలు కమ్యూనిస్టుల పలుకుబడిని గురించి ప్రజల్లో ప్రచారం జేస్తున్న పద్ధతి.

మొట్టమొదట కమ్యూనిస్టులు ఆగస్టు విప్లవానికి ద్రోహంచేశారని ప్రచారం చేశారు. ఆగష్టు చర్యలతో తనకేమీ సంబంధంలేదని గాంధీగారు ప్రకటించిన తర్వాత ' కమ్యూనిస్టులకు అహింసా సిద్ధాంతంలో విశ్వాసము లేదు. నిర్మాణ కార్యక్రమంలో విశ్వాసంలేదు. కమ్యూనిస్టులు జాతీయతా

వ్యతిరేకులు. ఇండియాను స్టాలిన్‌కి ఇచ్చివేస్తారు, అని ప్లేటుమార్చారు. రష్యాలో మాదిరిగా కమ్యూనిస్టులు శ్రామిక నియంతృత్వం కావాలంటు న్నారని ఆంధ్ర రైతాంగాన్ని రంగాగారు భయపెట్టాలని చూశారు. తెనాలి నేషనల్ క్లబ్బులో రంగాగారిలా ఉపన్యసించారు.

"మనరాష్ట్రంలో బడితభాయిగాండ్ల పార్టీ ఒకటివుంది. (కమ్యూ నిస్టులు కాంగ్రెసువాదులమీద బడితెలు ఈటెలు ఉపయోగిస్తున్నారని ఈయన ఉద్దేశం) ఈపార్టీకంటె జస్టిస్ పార్టీయే యెంతోమంచిది. జస్టిస్ పార్టీ కాంగ్రెసును బహిరంగంగా స్పష్టంగా యెదిరించేది. అందువల్ల కాంగ్రెసుకు జస్టిస్‌పార్టీ యేమంత ప్రమాదకరమైనది కాదు. కమ్యూనిస్టు పార్టీ ఒక్కటే యిక్కడ మనకు ప్రమాదకరమైనపార్టీ. ఇప్పుడిది దాదాపు ప్రతివూళ్లో వ్యాపించింది. కమ్యూనిస్టుల దౌర్జన్యచర్యల ఫలితంగానే, జర్మనీ, ఇటలీ దేశాల్లో హిట్లరు, ముసోలినీలు అధికారంలోకి వచ్చారు. రష్యాలో కమ్యూనిస్టులు రైతుల్ని నాశనంజేసి కార్మికుల్ని అధికారంలోకి తెచ్చారు. రష్యాలో 80 లక్షలమంది రైతుల్ని చావగొట్టారు. చల్లపల్లితో చేతులు గలుపుతున్నామని కమ్యూనిస్టులు మనల్ని ఆడిపోస్తున్నారు. కాని చల్లపల్లికి మనకీ యెంతోదూరం. కరువుతో మలమల మాడిపోతూవున్న బెంగాల్లో కమ్యూనిస్టులు ఏంజేశారో మీకు తెలుసా? తిండిలేక ఆకలితో అలమటించిపోయే ప్రజల గొంతుకల్లో గుక్కెడు గంజినీళ్లుబోసి విప్లవం రాకుండా ఖూనీచేశారు. ప్రభుత్వ ఆఫీసులమీదికి బ్రహ్మాండమయిన ఆకలి యాత్రలు నడిపేదానికి బదులు అసలు విప్లవ జ్వాలనే ఆర్పేశారు. కమ్యూ నిస్టులు మనదేశంలో పెద్ద పెద్ద పరిశ్రమలు అభివృద్ధి గావాలంటున్నారు. అంటే దీని అర్థమేమిటి? మొత్తం 40 కోట్ల జనాభాలో ఒక కోటి మందికిమాత్రం ఉద్యోగాలు, తక్కిన 39 కోట్ల ప్రజలకి నిరుద్యోగం అన్నమాట. ఈ జనం అంతా ఇక పిడకలు చేయాలిసిందే. పరిశ్రమలు ఇంకా అభివృద్ధి అయితే ఈ పిడకలు చేసే పనికూడా వుండదు."

కమ్యూనిస్టువ్యతిరేకత కాంగ్రెసు నాయకుల్ని ఎక్కడికి తీసుక పోయిందో చూడండి. బ్రాహ్మణ వంశసంజాతులయిన కాశేశ్వరరావుగారు హిందూమహాసభను కొనియాడుతున్నారు. బ్రాహ్మణేతరులయిన రంగా గారి దృష్టికి జస్టిస్‌పార్టీ మంచిదిలాగా కన్పిస్తూవుంది. ఔను మనుష్యులు కూడా నీరులాగా ఎవళ్ళకు తగిన స్థానాన్ని స్థాయిని వాళ్లేచూచుకుంటారు.

# వెంగమ్మ నాటక ప్రదర్శనాలు

వెంగమ్మ డ్రామాను ఆడించెవరు? ఎవరు ఆడించారు. ఆడుతూ వున్నప్పుడు జరిగిన విశేషాలేమిటి?

ఈ నాటకాన్ని ఆడటానికి రెండుదళాలు ఏర్పడ్డాయి. ఒకటి దివి తాలూకాదళం. రెండవది బెజవాడ తాలూకాదళం.

దివితాలూకా కాంగ్రెసు అసెంబ్లీ కార్యదర్శియైన ఏలేశ్వరపు కృష్ణమూర్తిగారే దివితాలూకా దళానికి ఆర్గనైజరు. "కాంగ్రెసువాదులచే తయారుచేయబడిన కాంగ్రెసునాటకం" అని మొదటిరోజుల్లో యితను దీన్నిగురించి బహిరంగంగా చెప్తూ వుండేవాడు. కాని చివర చివరకు తాను వ్యక్తిగతంగానే 'వెంగమ్మ' ను ఆడిస్తున్నానని కాంగ్రెసు అసెంబ్లీ కార్యదర్శి హోదాలోగాదని చెప్పాడు.

ఇక రెండోదళంలో ఒక్క లంకా వెంకటేశ్వర్రావుతప్ప మిగతా వారంతాజూదరులు, రౌడీలు. లంకా వెంకటేశ్వర్రావుగారు గ్రామపురోహితులు. ఒక హరిజన స్త్రీని బలాత్కరించబోగా హరిజనులంతా ఏకమై ఈయనకు తగినశాస్తి చేసినసంగతి ఈయన స్వగ్రామంలో అందరి తెలిసిందే.

ఈ ట్రూప్‌లో ఇద్దరు రైతులు, ఇద్దరు కాంగ్రెసువాదులుకూడ ఉన్నారు. రైతులిద్దరూ మైలవరం రాజాగారి భృత్యులు. యిక కాంగ్రెస వాదులమని చెప్పుకొనే మిగతాయిద్దరు ఎంత నిజాయితీగలవారో కొంచె పరిశీంచిచూద్దాం.

1. జి. లక్ష్మయ్య: జూదమాడి ఉన్న ఆస్తిని పోగొట్టుకున్న పేదరైతు. శాసనోల్లంఘనోద్యమంలోను, 1940 వ్యక్తిసత్యాగ్రహంలోను పాల్గొన్నాడు.

2. కె. జనార్దనరావు: కంకిపాడులో మొదట ఇతనొక చిన్న బుక్‌బైండర్‌గా వుండేవాడు. తర్వాత కొందరి కాంగ్రెసువాదుల సలహావల్ల బుక్‌సెల్లర్ అయ్యాడు. ములుకోల, వెంగమ్మ మొదలయిన కమ్యూనిస్టు వ్యతిరేక సరుకులే యీయన షాపులో వుండే స్టాకు.

## కమ్యూనిస్టు వ్యతిరేకుల నగ్నస్వరూపం

జనార్దనరావుగారి ' జాతీయసేవ ' ఫలప్రదంగాకుండా వూరికే పోయిందా ? ఇంతకు పూర్వం కాంగ్రెసు అంటే యేమిటో యెరగని యీయనికి కృష్ణాజిల్లా కాంగ్రెసు అసెంబ్లీ సహాయకార్యదర్శి పదవి లభించింది.

తెరమరుగునవుండి యీ నాటకాన్ని ప్రోత్సహిస్తుంది ముఖ్యంగా జమీందార్లు. అందువల్ల జమీందారీ ఏజెంట్లకు కమ్యూనిస్టురైతులకూమధ్య సంఘర్షణలు జరుగుతున్నాయి. ఎక్కడెక్కడ ఈ నాటకాన్ని ప్రదర్శించారో ఏ యే విశేషాలు జరిగినయ్యో ఒక్కసారి సంక్షిప్తంగా పరిశీలించుదాం.

కోడూరు : గ్రామకరణం వంశపారంపర్యా దోపిడీదారు. గ్రామ రైతులచేత వెట్టి చేయించుకునేవాడు. రైతులచేత పొలం దున్నించుకోవడం. పెంటపోగు తోలించుకోవడం మొదలగు వెట్టిపనులు చేయించడం పరిపాటి. దివిసీమలో పేరెన్నికగన్నలంచగొండి. రైతులు చైతన్యం చెందితే తన ఆటలు సాగవని, రైతుసంఘాల ప్రాబల్యమును అరికట్టుటకు పూనుకున్నాడు. ఖద్దరుషాపు మేనేజరైన మల్లంపాటి నాగభూషణం ప్రోద్బలంతో నీచాతినీచమైన ' వెంగమ్మ ' నాటక ప్రదర్శనానికి కరణం తయారయ్యాడు.

స్థానిక రైతుసంఘవర్కర్లు పుస్తకం తీసుకొని ఇంటింటికి తిరిగి నాటకంయొక్క బండారాన్ని బయటపెట్టారు. చుట్టుప్రక్కల గ్రామాలలో కూడా ప్రచారం చేశారు. ఈ అసభ్యమైననాటకం ప్రదర్శించడం మంచిది కాదని, కాంగ్రెసు ప్రతిష్టను మట్టిపాలు చేయడమని రైతులన్నారు.

తాలూకా కాంగ్రెసు అసెంబ్లీకార్యదర్శి ఏలేశ్వరపు కృష్ణమూర్తి నాయకత్వాన నాటకదళం తయారై ప్రదర్శనకుపూనుకున్నది. చుట్టుప్రక్కల గ్రామాలనుండి రైతులు ఊరేగింపుతో నినాదాలిచ్చుకుంటూ వచ్చారు. నాటకదళం కాలికి బుద్ధిచెప్పింది. తరువాత రైతుసంఘం తరపున బహిరంగసభ జరిపి కాంగ్రెసుపేరుతో, అభివృద్ధినిరోధకులు, లంచగొండులు కమ్యూనిస్టులపైన ఎంత నీచ ప్రచారానికిపూనుకున్నారో తెలియచెప్పారు. తరువాత కష్టజీవి బుర్రకథ చెప్పబడింది.

అవనిగడ్డ : మాజీ కృష్ణాజిల్లా కాంగ్రెసు అధ్యక్షులయిన ఎ. నాగేశ్వర్రావుగారి దగ్గరకు వెళ్ళి రైతుసంఘవర్కర్లు వెంగమ్మ నాటకాన్ని గురించిన వివరాలన్నీ చెప్పారు. పరిస్థితులు యింత అధ్వాన్నంగా మారి

పోతూవున్నందకు నాగేశ్వరరావుగారికి నిజంగా ఏడ్పువచ్చిందంటే అతిశయోక్తిగాదు. ఈలాంటి దక్కుమాలిన నాటకం ఆడకుండా నా చేతనయినంత వరకు తప్పక తోడ్పడతానన్నారు. స్థానిక కాంగ్రెసువాదులిద్దర్ని కలుసుకొని దీన్ని గురించి చర్చించారు. ఈ నాటకంతో మా కేమీ సంబంధంలేదని, ఇక్కడ ఆడాలని మేము దీన్ని ప్రోత్సహించలేదని వారు సమాధానమిచ్చారు.

ఈ వెంగమ్మ ప్రదర్శనం తగదని ఒకవారమంతా కమ్యూనిస్టు, కిసాన్ వర్కర్లు ప్రచారం చేశారు. కాని అనేక క్రిమినల్ కేసులలో విచారించబడిన గద్దె క్రిష్ణయ్యగారి ప్రోత్సాహంతో ఈనాటక ప్రదర్శనఏర్పాట్లు చేయబడినవి. ఎవరుకూడా తమ యింటి ఆవరణలో యీ నాటకాన్ని ఆడటానికి అంగీకరించలేదు. ప్రత్యేక ప్రదేశంలో నాటకం వేయడం మొదలు పెట్టారు. 'స్వతంత్ర భారత్ కీ జయ్' అనే నినాదంతో అక్కడికి వెళ్ళిన రైతుసంఘ సభ్యులమీద రాళ్ళు రువ్వారు. అంతటితో వ్యవహారం ముదిరి దెబ్బలాటలోకి దిగింది అనేకమంది గాయపడ్డారు.

బెజవాడ : కమ్యూనిస్టు వ్యతిరేకులైన చిట్టి (కృష్ణాజిల్లా కాంగ్రెస్ మాజీ అధ్యక్షుడు) అతని బావమరది గణపతిరావులు (కృష్ణా జిల్లా కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గ మాజీసభ్యుడు) దసరా ఉత్సవాల్లో (1944 నవంబరు) 'వెంగమ్మ' ను గురించి బ్రహ్మాండమైన ప్రదర్శనం జరపాలనుకున్నారు. దసరా ఉత్సవాల్లో పౌరాణిక వేషాలతో ఊరేగింపులు జరపడం వెనకటినుంచి వస్తూవున్న ఆచారం. ఈ సారి చిట్టి, గణపతిరావులు కొందరు సోషలిస్టులు మరికొందరు ఆర్. యస్. యస్. సభ్యులు కలసి సమిష్టిగా పూనుకున్నారు. రెండుబండ్లు మాట్లాడారు. వేషాలు వేయడానికి కొందరు రౌడీల్ని అద్దెకు తీసుకున్నారు. ఒక బండిమీద "కామ్రేడ్ వెంగమ్మ" అనే పోస్టరును అంటించారు. సూర్యనారాయణ అనే ఒక రౌడీ "కామ్రేడ్ సుందయ్య" వేషం వేశాడు. మరొకతను వెంగమ్మ వేషంవేశాడు. రెండో బండిలో ఒక బ్రాహ్మణ విధవ స్త్రీని ఒక మహమ్మదీయుడు బలాత్కరిస్తూ ఉన్నట్లు హిందువు తన హిందూ స్త్రీనికూడా తాను కాపాడుకోలేక పిరికిపందవలె గుడ్లొప్పగించి చూస్తూవున్నట్లు చూపెట్టారు. "సుందరయ్యనశించాలి, కమ్యూనిస్టులు పెనుభూతాలు" మొదలైన నినాదాలతో 30, 40 మంది రౌడీలు ముందునడుస్తూవుండగా ఊరేగింపు బయలుదేరింది. ఊరేగింపు కొంతదూరం వచ్చినతర్వాత సుందయ్య

-

## కమ్యూనిస్టు వ్యతిరేకుల నగ్నస్వరూపం

వేషధారి వెంగమ్మను అరమోడ్పు కనుదోయితో నవలోకిస్తూ అసహ్యాకర మైన అభినయంతో వెంగమ్మను తానేమిచేసింది బూతులభాషలో వర్ణించ సాగాడు. పుణ్యదినంగా భావించబడే దసరానాడు యీ నీచాతినీచమైన పనుల్నిజూచి ప్రజలు అసహ్యించుకున్నారు. ప్రజల్లోవచ్చిన వ్యతిరేకత వల్ల వెంగమ్మనాటకాన్ని ఆడించుదామనుకున్న వీరి అసలు ఉద్దేశం కొన సాగలేదు.

కాశేశ్వరరావుగారి నాయకత్వాన కొత్తగా యేర్పడిన కాంగ్రెస్ అసెంబ్లీలో సుందయ్య వేషధారి అయిన సూర్యనారాయణకు బెజవాడ నగరకాంగ్రెసు అసెంబ్లీ ఉపాధ్యక్షపదవి బహూకరించబడింది. ఔను మరి వీరుచేసిన సేవ ఊరకేపోతుందా? ఈవిధంగా రౌడీలు, లోఫర్లు జమీం దార్ల భృత్యులు, షాహుకార్ల తొత్తులు, వెంగమ్మనాటకం వేయడానికి ఎంత తహతహ పడుతున్నారో చూశాం. కమ్యూనిస్టు వ్యతిరేకులయిన కాంగ్రెసువాదులు వీరిని ఎలా బలపరుస్తున్నారో, తెరచాటునవుండి ఏలా ప్రోత్సహిస్తున్నారోకూడా చూశాం.

—౦౦౦—

# 'కాంగ్రెసు' - కమ్యూనిస్టు తగాదాలు

ఎక్కువ ప్రదేశాల్లో వెంగమ్మనాటకం వేయడం ఆగిపోయింది. వేసినచోట దెబ్బలాటలకు దారితీసింది. 'వెంగమ్మ' లాంటి అవినీతికర చర్యల్నికూడా కమ్యూనిస్టు వ్యతిరేకులైన కాంగ్రెసువాదులు సమర్ధించడం వల్ల జమీందార్ల ఏజెంట్లకు, రౌడీలకు, అధికలాభపరులకు, తిండిదొంగలకు, బాగా ధైర్యంవచ్చింది. మహిళాసంఘ నాయకురాలయిన హనుమాయమ్మగారిని వానపాములలో ఒక హరిజనుడు తప్పతాగి పిచ్చికూతలు కూస్తూ వెంటాడితే, స్థానిక కాంగ్రెసువాదినని పిలుచుకుంటున్న అట్లూరి వెంకటరత్నం 'అది మంచిపనే' అని సమర్ధించాడు. "కమ్యూనిస్టులు, కూలీలు అంతా ఒకే కుటుంబానికి చెందినవారు. ఇందులో ఎవరిని ఎవరు ఏమంటేమాత్రం తప్పేముంది?" అని తన విజ్ఞానాన్ని రాజకీయాలతో ముడిబెట్టాడు!

రావులపాడు గ్రామంలో సోమయ్య అనే ఒక ధనిక రైతున్నాడు. 100% వడ్డీతో బీదలకు గింజలిచ్చేవాడు కిసాన్‌సభ వర్కర్లు ఇది అన్యాయమని $6\frac{1}{4}$% కంటె యెక్కువవడ్డీవున్న ఏకాగితంమీద సంతకం చేయవద్దని రైతుల్లో బాగా ప్రచారంగావించారు. ఈసంగతి సోమయ్యకి తెలిసి మండిపొయ్యాడు. ఏలాగయినాసరే కమ్యూనిస్టుల్ని దెబ్బగొట్టాలని కొందరు సోషలిస్టుల్ని పిలిపించి, ఊళ్లోమీటింగుబెట్టించాడు. పక్కగ్రామాన్నుంచి 50 మందిని మద్దతు తెచ్చుకున్నాడు, ముందొక రైతుసంఘవర్కరుని దెబ్బగొట్టి తగాదారెచ్చగొట్టాడు. చివరకు దెబ్బలాటతో ముగిసింది.

ఉప్పలూరులో ఆంజనేయులు అనే ఒక మాష్టర్ వీవరున్నాడు. ఇతడు తనకు వచ్చిన నూలును నేతపని వారల కందించకుండా బ్లాక్‌మార్కెట్ చేయడం మొదలెట్టాడు. స్థానిక కమ్యూనిస్టులు ఈకేసుపట్టుకొని డిప్యూటీ కలెక్టరుకి రిపోర్టు చేశారు. కంట్రోలు రేటుప్రకారం ఆ నూలునంతా నేతపనివారలకందించారు. ఈమంటతో ఇతను ఇతని అనుచరులు కలిపి కమ్యూనిస్టుల్ని రెచ్చగొట్టడానికి బహిరంగ స్థలంలో బిగ్గరగా వెంగమ్మనాటకాన్ని చదువుతూ ఆ పక్కనే పోతూవున్న యిద్దరు కమ్యూనిస్టుల్ని కొట్టారు. దానితో వ్యవహారం ముదిరి దెబ్బలాటగా తయారయింది. దెబ్బలు తిన్న ఆ మాష్టర్ వీవర్‌గ్రూపు సబ్‌ఇన్‌స్పెక్టరుకి

(వారిస్నేహితుడు) రిపోర్టు చేసింది. ఆ సబ్ఇన్స్పెక్టరు ఒక్క కమ్యూ నిస్టులమీద మాత్రమే కేసుబెట్టాడు.

విపరీతమయిన గుడ్డి కమ్యూనిస్టు ద్వేషంవల్ల అనేక ప్రదేశాల్లో కాంగ్రెసువాదులు ప్రజల్ని పీడించుకతినే షాహుకార్లు, జమీందార్లతో బహి రంగంగా చేతులు కలుపుతున్నారు. జాతీయవాదుల్లో యింతవిపరీతమైన మార్పు ఏలావచ్చింది. ఇందుకుకారణం ఒకటే. "ఏవిధంగానైనాసరే కమ్యూనిస్టుల్ని నాశనం చేయాలిసిందే," అనే పిచ్చిపట్టుదలే వీరినింత అధోగతికి తెచ్చింది. రైతుల్లో కూలీల్లో కమ్యూనిస్టులు ఒక నూతన జాగృతిని కలిగించారు. పెత్తందార్ల ఆటలు వెనకటిలాగా సాగకుండా పొయ్యాయి. కాబట్టి యేదోవిధంగా కమ్యూనిస్టుల్ని నాశనం చెయ్యా లిసిందే అని కత్తికట్టారు. కమ్యూనిస్టు వ్యతిరేకులయిన కాంగ్రెసు వాదులకు కూడా కావాలిసింది అదే కాబట్టి, ఒకే లక్ష్యాన్ని సాధించడానికి ఉభయులూ చేతులు గలుపుతున్నారు. ఇందుకుకొన్ని ఉదాహరణలిస్తాను.

ఆంధ్రరాష్ట్రంలోని పెద్దజమీందారుల్లో చల్లపల్లి ఒకడు, ఇతనికి శిస్తురూపంగా వచ్చేఆదాయమే దాదాపు 4 లక్షలుంటుంది. ఇంకా 17500 ఎకరాల స్వంతకమతం ప్రత్యేకంగా వుంది, ఇతను మొట్టమొదటినుంచి కాంగ్రెసుకు ఆగర్భశత్రువు. ప్రముఖ జస్టిస్ పార్టీనాయకుడు. 1937 అసెంబ్లీ ఎన్నికల్లో కాంగ్రెసును ఓడించడానికి కనకవర్షం కురిపించాడు. ప్రతిపల్లెటూళ్ళోవున్న మోతుబరుల్ని, రౌడీల్ని గత 20 సంవత్సరాల్లో తనకండగా తయారు చేసుకున్నాడు. ప్రతిగ్రామంలో రైతుసంఘాన్ని నిర్మించి పనిజేస్తూన్న కమ్యూనిస్టు నాయకుల నెదుర్కోవడానికి ఈ చల్ల పల్లి గ్రూపులోవున్న అనేకమంది వ్యక్తులు నేడు కాంగ్రెసు ముసుగుతో బైటికివస్తున్నారు.

వక్కలగడ్డ గ్రామంలో (దివితాలూకా) యీ రాజాగారి ఆశ్రితుడు సమిష్టిభూమిని బీదరైతుల కుపయోగపడకూడదనే దురుద్దేశంతో అక్ర మంగా ఆక్రమించుకున్నాడు. ఈ సమిష్టి భూమి చాలా సారవంతమైనది. ఎరువుల కుపయోగిస్తుంది. ఈ అక్రమమైన ఆక్రమణను అరికట్టడానికి కలిసి పనిజేద్దాంరమ్మని కమ్యూనిస్టులు పోటీ రైతుసంఘ నాయకుడయిన వెంకట సుబ్బయ్యగారిని అడిగారు. వెంకట సుబ్బయ్యగారు కమ్యూనిస్టు లతో కలసి పనిచేయకపోగా పెద్దరైతుల్ని తిరగదీసి జమీందారు పక్షానికే

పూర్తిగా మద్దతిచ్చారు. చివరకీ వ్యవహారం కాంగ్రెసు కమ్యూనిస్టు తగాదా స్వరూపాన్ని తీసుకుంది. జమీందారీ ఏజెంట్లు బంట్లు నేడు తాము కూడా పెద్దకాంగ్రెసువాదులమని చెప్పుకుంటున్నారు. వీళ్ళందర్నీ నిజమైన కాంగ్రెసువాదులుగా గుర్తించి దివి తాలూకా కాంగ్రెసు వర్కర్సుఅసెంబ్లీ సెక్రటరీ అయిన ఏలేశ్వరపు కృష్ణమూర్తిగారు (వెంగమ్మ నాటకప్రదర్శనాలకు ప్రధాన ఆర్గనైజర్) వీళ్ళకి పూర్తిగా సపోర్టు చేశాడు.

వెలువోలు గ్రామంలో (దివి తాలూకా) చల్లపల్లి ఏజెంటు అయిన కోనేరు బసవయ్య ఆ గ్రామంలో వున్న బంజరుభూమి నాక్రమించుకున్నాడు. వెంటనే రైతులంతా ఏకమై ఆ ఏజంటును ఆ భూమిలో అడుగుపెట్టకుండా తరిమివేశారు. రాజాగారి సహాయంతో యిప్పుడు ఆ బసవయ్య రైతులమీద కేసుపెట్టాడు. స్థానిక కాంగ్రెసు నాయకులయిన గొట్టిపాటి వెంకట సుబ్బయ్యగారు ( ఆంధ్రరాష్ట్ర రైతు కాంగ్రెసు అధ్యక్షుడు ) గొట్టిపాటి బ్రహ్మయ్యగారు ఇంతవరకు కాంగ్రెసు ముక్కా మొగం ఎరగని ఆ బసవయ్యని ఒక పెద్దకాంగ్రెసువాదిగా గుర్తిస్తున్నారు.

రైతుసంఘానికి బలీయమయిన స్థానాల్లో మంగళాపురం ( దివి తాలూకా ) ఒకటి ఇది మొదటినుంచి చల్లపల్లిరాజామధ్య రైతుసంఘం మధ్యజరిగిన తగాదాలకు ప్రసిద్ధిజెందిన గ్రామం. ఈ గ్రామంలో రాజాగారి ఏజంటు చంద్ర అంజయ్య అనే ఒక ధనికరైతు. బీదప్రజల్ని పీల్చుకు తింటంలో ఈయన బాగా పేరుమోగినవాడు. కమ్యూనిస్టుల్ని దూషించడం, రైతుసంఘాన్ని దుమ్మెత్తిపోయడం, ఈయన నిత్యకృత్యాల్లో ఒకటి. ఈ చల్లపల్లి అనుచరుణ్నే యివ్వాళ కాంగ్రెసు అసెంబ్లీ ఫిర్కా ఆర్గనైజరుగా జేశారంటే చల్లపల్లి గ్రూపు కమ్యూనిస్టు వ్యతిరేకులయిన కాంగ్రెసు వాదులు ఏవిధంగా కలసి పోయారో యీ ఒక్క ఉదాహరణవల్లనే చక్కగా తెలుసుకోవచ్చు.

ఒక్క చల్లపల్లేకాదు. ఇవ్వాళ కమ్యూనిస్టులమీద కత్తిగట్టిన ప్రతి షాహుకారు, ప్రతి భూస్వామి కాంగ్రెసుకు దగ్గరి చుట్టం అవుతున్నాడు.

వెంట్రప్రగడ గ్రామంలో జస్టిస్‌పార్టీ ప్రముఖుడయిన వీరరాజుఅనే ఒక ధనికరైతు ఉన్నాడు. ఇతని భార్యపేర వంద ఎకరాల ఆస్థివుంది. బీద ప్రజల్ని పీల్చుకుతింటంలో యీయన కూడా పేరెన్నిక గన్నవాడే. 1940 జిల్లాబోర్డు యెన్నికల్లో యీయన కాంగ్రెసుకు పోటీ బెట్టి ఓడి

పొయ్యాడు. కాని యివ్వాళ యితనుకూడా ఒక కాంగ్రెసువాదే అయి పొయ్యాడు. ఇతని గ్రూపుకు చెందినవాళ్ళల్లో ఒకతను తాలూకా కాంగ్రెస్ అసెంబ్లీకి సభ్యుడుగా తీసుకోబడ్డాడు. సుప్రసిద్ధ గాంధీస్టు అయిన ఎర్నేని సుబ్రహ్మణ్యంగారు, అంజయ్యగారు వెంట్రప్రగడ వెళ్ళినప్పుడు వీరి సన్మానాన్ని తీడుకున్నారు.

ఈ తతంగమంతా రైతుసంఘం బలంగా ఉన్న ఒక్క కృష్ణాజిల్లా లోనేకాదు. ఇతర జిల్లాల్లోకూడా యిదే వ్యవహారం.

కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన గత 7 సంవత్సరాలనుంచి దావులూరు గ్రామంలో (తెనాలి తాలూకా) బలమైన రైతు కూలీ సంఘ ఉద్యమం నిర్మింపబడింది. ఈగ్రామంలో శివరామబ్రహ్మం అనే ఒక మోతుబరి రైతున్నాడు. ఇతను గ్రామ ధర్మాదాయాన్ని కూడా అపహరించిన పెద్ద మనిషి. ఇతను కిరసనాయిల్ బ్లాకుమార్కెట్ చేస్తూవుండేవాడు. దీన్ని గురించి వర్కర్లు ప్రజల్లో తగినంత ప్రచారంచేసి ఇతనిమీద బాగా ఒత్తిడి తెచ్చారు. ఈ ఒత్తిడికి తట్టుకోలేక కిరసన్ పంపకం బాధ్యత తానుమాను కొవి యితరులకు ఒప్పగించేశాడు. ఈగ్రామంలో యితనికి అన్నివిధాల అండగావుండే ఒక క్రిష్టియన్ పంతులున్నాడు. ఇతనికి కమ్యూనిస్టు లంటే మహామంట. రైతులు విజ్ఞానవంతులు గావడమంటే వెనకబడ్డ క్రిష్టియన్ బీదప్రజలనుంచి ఇంతవరకూ తాను అక్రమంగా పొందుతూన్న మామూళ్ళు అంతటితో బంద్, అని అతనికి బాగాతెలుసు. కమ్యూనిస్టులు తమ పార్టీని బలపర్చుకోవడానికి స్త్రీలను ఉపయోగిస్తారని ఊరంతా తిరిగి ప్రచారంచేశాడు. దీనిఫలితంగా కమ్యూనిస్టులకీ ఆపంతులకీ దెబ్బలాట జరిగింది. శివరామబ్రహ్మం సపోర్టుతో కమ్యూనిస్టులమీద కేసుబెట్టాడు. నన్నపనేని వెంకటరావు నాయకత్వాన తెనాలి కాంగ్రెసువాదులు ఇతనికి సహాయంచేస్తున్నారు.

పెదపాడు గ్రామంలో (ఏలూరు తాలూకా) రెండు మూడు వందల యెకరాల ఆస్థిగల గారపాటి చిన కనకయ్య అనే ఒక భూస్వామిఉన్నాడు. పంటకాల్వకు అడ్డకట్టవేసి ముందు తన పొలమంతా తడుపుకొన్న తర్వాత గాని యితరుల పొలాలకి నీళ్ళు పోనివ్వడు. ఈ అక్రమ చర్యను అరికట్ట డానికి స్థానిక కమ్యూనిస్టు రైతు వర్కర్లు యీ సమస్యమీద గ్రామాన్ని అంతా ఏకంజేశారు. తనకండ్లముందే ఇంతపని జరుగుతుంటే ఇంకా కన కయ్యకికోపంరాకుండావుంటుందా? కమ్యూనిస్టులుబలంగావున్న పోతునూరు

గ్రామంలో పోటీ రైతుసంఘాన్ని స్థాపించాలని కమ్యూనిస్టు వ్యతిరేకులయిన ఏలూరు తాలూకా కాంగ్రెసు వాదుల్ని పోయి పట్టుకున్నాడు. పోతునూరులో మీటింగుబెట్టి కమ్యూనిస్టులు ఒక రైతుసంఘంవుండగా దీనికి పోటీగా రెండోసంఘం పెట్టడం మంచిపద్ధతి గాదనీ, రైతు అయిన ప్రతివానికీ రైతుసంఘంలో సభ్యుడుగా జేరేహక్కుందనీ తెలియజెప్పారు. మీటింగు జరగకుండా చెడగొట్టాలని కనకయ్యగ్రూపు సిద్ధమయింది. అంతటితో కనకయ్యగ్రూపుకీ కమ్యూనిస్టులకీ మధ్య తగాదా చెలరేగి దెబ్బలాటలోకి మారింది.

ఏలూరు తాలూకా కాంగ్రెసునాయకుడైన మూల్పూరి రంగయ్యగారితోకలిసి యీ కనకయ్యే రంగాగారికి వెయ్యినూటపదహార్లు సమర్పించుకున్నాడు. రంగాగారికోసం ప్రత్యేకంగా తన గ్రామంలో ఒక మీటింగు నేర్పాటు జేశాడు.

కావాలంటే యీలాటి ఉదాహరణలెన్ని అయినా ఇవ్వొచ్చు కాని యింకొక ఉదాహరణ మాత్రం యిచ్చి యీ అధ్యాయం ముగిస్తాను.

అనంతపురం జిల్లాలో కమ్యూనిస్టులు గతనాలుగు మూడు సంవత్సరాలనుంచి నిర్మాణయుతంగా పనిజేస్తున్నారు. ఈజిల్లాకుచెందిన ఒక గ్రామంలో (ఉరవకొండ తాలూకా) రాయల గోవిందప్ప అనే కొన్ని వందల ఎకరాల భూమిగల పెద్ద భూస్వామి ఉన్నాడు. ఇతడు ప్రజలకు బద్ధశత్రువు. ఇతనికే పోటీరైతుసంఘ ప్రెసిడెంటు హోదా యివ్వబడింది.

ప్రజల్ని దోచుకుతినే జమీందార్లు నిరంకుశాధికార్లతో కాంగ్రెసు వాదులీవిధంగా చేతులు కలపడంవల్ల దెబ్బలాటలు జరగడంలో పెద్ద ఆశ్చర్యమేమీలేదు. ప్రజల్ని దోచుకుతినే దోపిడీవర్గానికి—దోపిడి చేయబడే రైతుకూలీ వర్గానికి, అభివృద్ధి నిరోధకులకీ అభివృద్ధి కాముకులకీ, మధ్య జరిగే సంఘర్షణలివి. వీటిని రెచ్చగొట్టింది, కాశేశ్వరరావు, రంగా ప్రభృతులే.

కాశేశ్వరరావు చంద్రమౌళి ప్రభృతులు హాజరయిన గోవాడ సభలో రంగా సభికులకీ విధంగా విజ్ఞప్తి చేశాడు.

"వివిధ దేశాల ప్రజలు తమ స్వాతంత్ర్య పోరాటాన్ని నిర్విఘ్నంగా కొనసాగించాల్నంటే ముందు కమ్యూనిస్టులతో పోరాడాలి. వాళ్ళ పలుకుబడిని అరికట్టాలి. వాళ్ళను నాశనం చెయ్యాలి. మాస్కో జోక్యం

కలిగించుకోకుండా యెదుర్కోవాలి. ప్రతిదేశంలో కమ్యూనిస్టు నియంతృత్వం రాకుండా పార్టీని నిర్మూలించాలి."

నేడు ప్రజల్ని ఎదుర్కొనే సమస్యల్ని గురించి ఈసభలో ఒక్కరూ ఒక్కమాట చెప్పలేదు. "జోషీ ముఠా నశించాలి" "కమ్యూనిస్టుపార్టీ నశించాలి." యివి వారిచ్చిన నినాదాలు. కమ్యూనిస్టు వ్యతిరేకతను రెచ్చగొట్టడానికే ప్రతి ఉపన్యాసకుడు తన శక్తిసామర్థ్యాలను చూపించాడు.

కమ్యూనిస్టులు బెజవాడలో గెరిల్లా యుద్ధం నేర్చుకుంటున్నారనీ, బెజవాడను మాస్కోగా కాటూరును లెనిన్‌గ్రాడుగా మార్చివేశారని కాశీశ్వర్రావుగారు చెప్పారు. కమ్యూనిస్టులు గాంధీవ్యతిరేకులు, నిరీశ్వరవాదులు గాబట్టి తప్పకుండా వారిని యెదుర్కోవాలసిందే, అని కూడా సెలవిచ్చారు.

తర్వాత చంద్రమౌళిగారు యిలా ఉపన్యసించారు. "కమ్యూనిస్టులు రష్యా ఏజంట్లు" కాంగ్రెసును నాశనం చేయడమే వారిఉద్దేశం. కమ్యూనిస్టుపార్టీ పాలసీ నవలంబిస్తే బ్రిటిషు వాళ్ళ కింద బానిసలుగా వుండే దానికిబదులు రష్యాకింద బానిసలుగావుంటాం. బ్రిటిష్ ప్రభుత్వం కంటె కూడా కమ్యూనిస్టులే మనదేశానికి పరమ శత్రువులు."

ఈ విధంగా సభకు హాజరయిన పదివేలమంది ప్రజల్లో కమ్యూనిస్టు వ్యతిరేకపిచ్చిని రెచ్చగొట్టి వదిలిపెట్టారు. మీటింగు అయినతర్వాత గోవాడకు సమీపంలోనే వున్న అమృతలూరు పార్టీఆఫీసుమీద దాడి చేయడానికి చంద్రమౌళి, సీతారామయ్యగార్లలోటి కాంగ్రెసు నాయకులు మూడు వందలమంది ప్రజలకు లాఠీలిచ్చి పంపించారు. సీతారామయ్యగారు స్వయంగా దగ్గిరుండే యీ రౌడీ ముఠాను నడిపించారు. 'జోషీ ముఠా నశించాలి' అని కేకలేస్తూ రాత్రి 2-30 గంటలకు అమృతలూరుపార్టీ ఆఫీసుమీదికి వచ్చారు. స్థానిక కమ్యూనిస్టు రైతులు ముందే ఆచూకీ తెలుసుకొని ఆఫీసును కాపాడుకోడానికి సిద్ధంగా ఉన్నారు. తీవ్రమయిన పోరాటం జరిగింది. ఉభయపక్షాలవారు గాయపడ్డారు. సీతారామయ్యగారికి, బసవయ్యగారికి (స్థానిక కమ్యూనిస్టు విద్యార్థి నాయకుడు) కూడా ప్రమాదకరమైన దెబ్బలు తగిలాయి. దాడిచేసిన పక్షన్నుంచి తొమ్మండుగురిని దాడిని తట్టుకున్న పక్షన్నుంచి 16 మందిని పోలీసులు అరెస్టు చేశారు.

పైనుదహరించిన ఘటనల్నిబట్టి ఎవరెవరిమధ్య యీ దెబ్బలాటలు జరుగుతున్నాయో ఇప్పుడు తేలికగా తెలుసుకోవచ్చు. జమీందారీతొత్తులు, రౌడీలు. దొంగవర్తకులు, తిండిదొంగలు, వీరంతా ఒకపక్షం - వీళ్ళు చేసే అక్రమాల్ని అరికట్టడానికి పాటుపడే కమ్యూనిస్టులు, రైతులు, విద్యార్థులు మరోపక్షం. ఈ ఉభయపక్షాలమధ్యనే యిప్పుడు సంఘర్షణ జరుగుతూ వుంది. కాని కాశేశ్వరరావులాంటి కాంగ్రెసునాయకులు వీటిని కాంగ్రెసు కమ్యూనిస్టు తగాదాలుగా చిత్రిస్తున్నారు. దీని మూలకంగా కమ్యూనిస్టు వ్యతిరేకపోటంలో పల్లెటూరి ప్రజలసానుభూతిని సంపాదించవచ్చునని వీరిఉద్దేశం. బస్తీప్రజలకు రాష్ట్రేతర ప్రజలకూ తెలియడానికి "ఇంకే ముందిబాబో కమ్యూనిస్టులు కాంగ్రెసువాదుల్ని పట్టుకొని కొట్టేస్తున్నార"ని జాలి గొలిపేటట్టుగా ప్రకటనలు చేస్తున్నారు. వారిచ్చిన పత్రికా ప్రకటనలు చూడండి.

## కాశేశ్వరరావుగారి ప్రకటన

"నేను నలభై సంవత్సరాలనుంచి కాంగ్రెసులో పనిచేస్తున్నారు. కాంగ్రెసును అణగగొట్టడానికి బ్రిటిషు ప్రభుత్వం ఎన్నో దౌర్జన్యపద్ధతుల్ని అవలంబించింది. కాని ఈనాడు కమ్యూనిస్టు లుపయోగిస్తున్న పద్ధతులతో పోల్చిచూస్తే అవి అసలు లెక్కలోకి తీసుకోదగినవేకావు, ఇదివరకు జిస్టిస్పార్టీ మమ్ముల్ని ఎదిరించేది. కాని అదికూడా మామీద కర్రలూ కత్తులు ఎప్పుడూ ఉపయోగించలేదు. కాబట్టి ఈపరిస్థితుల్లో ఏంచెయ్యాలో ప్రజలే నిర్ణయించుకోవాలి హింసావిధానం మాత్రంతగదు."

## చంద్రమౌళిగారి ప్రకటన

"గోవాడ సభనుంచి తిరిగి వచ్చేటప్పుడు కమ్యూనిస్టుల ఆఫీసు మీద దాడిచేయాలని మాప్రజలు అనుకోనేలేదు. కమ్యూనిస్టులే ముందు మాప్రజలమీద దాడి సల్పారు. తమ తప్పును కప్పిపుచ్చుకోవడానికి కమ్యూనిస్టులీ విధంగా ప్రచారంచేస్తున్నారు. జిల్లా అంతాకోపంతో అట్టుడికి నట్లు ఉడికిపోతూంది. కాంగ్రెసుయొక్క అహింసాసిద్ధాంతానికి వ్యతిరేకంగానడుచుకోవద్దని ఇందుమూలంగా ప్రజలకునేను విజ్ఞప్తిచేస్తున్నాను. కమ్యూనిస్టులదౌర్జన్య చర్యల్ని అరికట్టి శాంతిభద్రతలను కాపాడవలసిందని ప్రభుత్వానికి మనవి. ముందు ఇలాంటి ఘటనలు ఇకజరగవని విశ్వశిస్తున్నాను."

## కమ్యూనిస్టు వ్యతిరేకుల నగ్నస్వరూపం

ఒక వైపు ఈ కాంగ్రెసు నాయకులు ఈవిధంగా దెబ్బలాటల్ని రెచ్చగొడుతూ బైటి ప్రపంచం కండ్లుమూయడానికి తామేమో అహింసా సిద్ధాంతాన్ని పాటిస్తున్నామనీ కమ్యూనిస్టులే హింసకు దిగారని జాలీగొలిపే స్టేటుమెంట్లు ఇస్తున్నారు. శాంతిభద్రతలను కాపాడమని ప్రభుత్వంతో మనవి చేస్తున్నారు. కమ్యూనిస్టులే హింసాయుత చర్యలకు దిగారని గాంధీగారికి రిపోర్టులు పంపిస్తున్నారు.

అసలు జరుగుతూవున్న యధార్థమేమిటో యింతవరకు చూశాం. కాంగ్రెసువాదులు వెనకుండి సహాయం జేయడం వల్లనే ప్రజావిరోధులైన రౌడీలు జమీందార్ల తొత్తులు నిరంకుశాధికారులయిన కరణాలు మునసబులు వెంగమ్మనాటకాన్ని ఆడిస్తున్నారు. కమ్యూనిస్టుస్త్రీల నైతిక ప్రవర్తనను గురించి అనరాని మాట లంటున్నారు. తమ భార్యల్ని తమ చెల్లెండ్లని యీవిధంగా పచ్చి బూతులు కూస్తూవుంటే యేరైతురక్తం ఉడుకెత్తకుండా వుంటుంది ?

పరిస్థితులు ఇంకా విషమించకుండా ఉంటానికి పార్టీ తన సభ్యుల్ని ఆత్మ నిగ్రహం కోల్పోవద్దని ప్రబోధిస్తూవుంది. ఈలాంటి దెబ్బలాటల వల్ల గ్రామ జీవిత విధానమే భగ్నమైపోతుంది. కాబట్టి తగాదాల నరికట్టి శాంతిని నెలకొల్ప వలసిందని పార్టీ ప్రజలకు విజ్ఞప్తి చేస్తూవుంది. ఈ పోట్లాటలు ఇంకా శ్రుతిమించిపోకుండా అపుచేయవలసిందని, తప్పుడు పద్ధతుల్ని ఖండించవలసిందనీ కాంగ్రెసునాయకులకు పదేపదే పార్టీ విన్నవించింది. కామ్రేడ్ సుందరయ్య స్వయంగావెళ్ళి కాంగ్రెసు మాజీమంత్రియైన శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారిని కలుసుకొని మాట్లాడారు. ఈలాంటి తప్పుడుపద్ధతుల్ని అరికట్టడానికి నా శక్తికొలది కృషిచేస్తానని గోపాలరెడ్డి గారు వాగ్దానం చేశారు. కాని చివరకు ఈ చర్యలతో కాంగ్రెసువారి కెట్టి సంబంధం లేదంటున్నారని చెప్పారు. "సరే అలాగే యీ చర్యలతో కాంగ్రెసువారి కెట్టి సంబంధంలేదని స్టేటుమెంటు ఇవ్వవలసిందని కోరగా ఇందుకేమీ సమాధానం ఇవ్వకుండా మౌనం వహించారు. రాష్ట్ర కాంగ్రెసు అసెంబ్లీ సెక్రటరీ ఐన సంజీవరెడ్డిగారినికూడా సుందరయ్యగారు కలుసుకొని కమ్యూనిస్టులమీద యేవిధంగా దుష్ప్రచారం సాగుతు దో, చివరకీ పరిస్థితులు ఆంధ్రదేశాన్ని యేస్థితికి తీసుకపోతాయో, ప్రజాశత్రువులు ఏవిధంగా కాంగ్రెసు ముసుగుకింద దూరి నాటకమాడుతున్నారో విపులీకరించి జరిగిన విషయాలన్నీ చెప్పారు. ఇందుకు సంజీవరెడ్డిగారు తాను

స్వయంగా వెంగమ్మనాటకాన్ని చదివిచూస్తాననీ, అందులో యేమైనా అవినీతికరమైన విషయాలుంటే వెంటనే దాన్ని ఖండిస్తూ పత్రికలకు స్టేటుమెంటు యిస్తాననీ, ఇలాంటి పద్ధతు లవలంబించవలదని కాంగ్రెసు వాదులకు ఒక సర్క్యులరుకూడా పంపిస్తాననీ వాగ్దానం జేశారు. ఫిబ్రవరి నెలలో యీ సంభాషణలు జరిగాయి. కాని యింతవరకు అటువంటిదేమీ జరగలేదు.

కాంగ్రెసునాయకులైన కాళేశ్వరరావు, చంద్రమౌళి ప్రభృతులే, రౌడీలకు, జమీందారీ భృత్యులకు, తిండిదొంగలకు కాంగ్రెసుబురఖా వేస్తున్నారు. వెంగమ్మనాటకాల్ని అమ్మేఅతన్ని కృష్ణాజిల్లా కాంగ్రెస్ అసెంబ్లీ సెక్రటరీగా జేశారు. వెంగమ్మ నాటకంలో వేషం వేసిన రౌడీని బెజవాడ నగర కాంగ్రెస్ అసెంబ్లీకి ఉపాధ్యక్షుణ్ణి జేశారు.

రైతుల కుమారుల్ని కుమార్తెల్నీ అన్నల్నీ తమ్ముల్నీ, పట్టుకొని యీవిధంగా బండబూతులు కూస్తూవుంటే గ్రామాల్లో దెబ్బలాటలు జరిగినయ్యంటే ఆశ్చర్యమేముంది? నిజంగా హత్యలు జరిగినా ఆశ్చర్యం లేదు. ఎదటివాడు బూతులు తిడుతూవుంటే విని సహించలేక ఆవేశంతో ముందుకురికే రైతుల్ని యెంతోకష్టంమీద ఆపుచేయవలసి వస్తుంది. రత్నాలవంటి తమబిడ్డల్ని కూతుళ్ళనీ, మనమరాళ్ళనీ పట్టుకొని బండ బూతులు తిడుతూవుంటే కాటికి కాళ్ళారజాచిన ముసలమ్మలు కూడా కొడుకుల్ని బిల్చి "ఈ బూతులు తిని యింకా మనం బతికేందుకు? మొగాళ్ళు అయితే వెళ్ళి వాళ్ళ నోళ్ళు మూయించండి" అని ఉద్రేకమెక్కిస్తారు.



# ఆంధ్ర దేశమా, ఎటు వైపు ?

కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులయిన డాక్టరు పట్టాభిసీతా రామయ్యగారు తమ బాధ్యత నేమాత్రం పాటించకుండా సిమ్లా ప్రయాణానికిముందు పత్రికలకీవిధంగా స్టేటుమెంటు ఇచ్చారు. "కర్రలతో ఈటెలతో కమ్యూనిస్టులు కాంగ్రెసువాదుల్ని కొడుతున్నారని అనేకమంది స్నేహితులదగ్గిరనుంచి నాకు రిపోర్టులువచ్చాయి. ఇందులో ఎన్ని నిజమో ఎన్ని అబద్ధమో నేనుచెప్పలేను. కాని అహింసాసిద్ధాంతం నిత్యజీవితంలో కూడా పాటించాలిసిందేనా ? లేక బ్రిటిష్‌ప్రభుత్వంమీద జరిపే స్వాతంత్ర్య పోరాటం వరకేనా ? అని కాంగ్రెసువాదులు ఆలోచనలో పడ్డారు."

ఆరుమాసాలనుంచి కాంగ్రెసువాదులు విడదీయలేని ఈ చిక్కుసమస్యని చరిత్రకారులయిన పట్టాభిగారు సుళువు సూత్రంగా విడదీసి చూపించారు. బందరు ఉపన్యాసంలో వారు చూపించిన పరిష్కారమార్గం ఇది.

"అహింసా సిద్ధాంతం ఆత్మరక్షణకు అన్వయించదు. కమ్యూనిస్టుల దౌర్జన్యాన్ని ఎదుర్కోవాలి. అంతకంటె మంచి ఆయుధాల్ని ఉపయోగించడానికి కాంగ్రెసువాదులు సిద్ధంగా వుండాలి"

ప్రకాశంగారు జైలునుంచి విడుదలై బైటికివచ్చిన వెంటనే "నేనే బైట ఉన్నట్లయితే నా ప్రజల్ని కొట్టడానికి కమ్యూనిస్టులకు గుండెలుండేయా ? అని గర్జించారు. "హింస నుపయోగించి అయినా సరే కాంగ్రెసువాదులు ఆత్మరక్షణ చేసుకోవాలి" అని ఏలూరు బహిరంగసభలో ఉపన్యసించారు.

డాక్టరు పట్టాభిగారు అసలు విషయాల్ని మసిబూసి మారేడుకాయ జేయాలని చూస్తున్నారు. వీరి ప్రకటనలద్వారా బైటి ప్రపంచానికి కనపడే చిత్రమేమిటి ? రక్తపిపాసులైన కమ్యూనిస్టులు అమాయికులైన కాంగ్రెసువాదుల్ని కత్తులతో పొడుస్తున్నారనీ, కర్రలతో బాదుతున్నారనీ, బ్రిటిష్ ప్రభుత్వాన్ని యెదిరించేటప్పుడు కాకుండా కమ్యూనిస్టుల్ని యెదిరించేటప్పుడుకూడా అహింసా సూత్రం పాటించవలసిన అవసరముందా అని ప్రజలు సందిగ్ధావస్థలోపడిపోయారనీ, ఈవిధంగా దారీ తెన్నూగానక అయోమయంగా వున్నసమయంలో డా॥ పట్టాభిగారువచ్చి తమ 'అమూల్యమయిన' నిర్ణయం అందజేశారనీ, రాష్ట్రేతరులైన ప్రజలు భావిస్తారు.

తొందరపడి పత్రికలకు ప్రకటనలమీద ప్రకటలు ఇవ్వకుండా కాస్త

శాంతం వహించి కమ్యూనిస్టులు కాంగ్రెసు వాదుల్ని ఎందుకు కొడుకు తున్నారో కొంచెమాలోచించి పరిస్థితుల్ని అర్థంజేసుకోవడానికి యేమాత్రం ప్రయత్నించినా అసలు విషయం వీరికి తేలికగా అర్థమయ్యేది. ఈపాటి స్వల్పవిషయాల్ని మన కాంగ్రెసు నాయకులు అర్థం జేసుకోలేనంత స్థితిలోలేరు. కాని బుద్ధిపూర్వకంగానే వారు అర్థంజేసుకోదలచుకో లేదు. కావాలనే వారీపద్ధతి అవలంబించారు.

పట్టాభిగారుచిత్రించినట్లుగాకుండా నేటి ఆంధ్రరాష్ట్రపరిస్థితి అందుకు పూర్తిగా భిన్నంగావుంది. జాతీయోద్యమంలో కాకలుదీరిన గ్రామీణ యువకుల్లో పెక్కుమంది నేడు పార్టీసభ్యులుగా వున్నారు. సంఘచైతన్యం కలిగిన ప్రజానీకంలో అధికభాగం పార్టీకే అండగావుంది. మొదటినుంచి జాతీయోద్యమానికి పట్టుగొమ్మలుగా వున్న కృష్ణా గుంటూరు జిల్లాలు యీరోజు ఆంధ్రకమ్యూనిస్టు పార్టీకి ఆధారభూతంగా వున్నాయి. జైళ్ళ నుంచి విడుదలైవచ్చిన కాంగ్రెసు నాయకులు కమ్యూనిస్టులకు జాతీయత లేదని ఏవేవో చెప్పారు. కాని యిలాంటి ప్రచారంవల్ల పప్పులు ఉడక లేదు. అంతటితో వ్యవహారం బూతుల్లోకి దెబ్బలాటల్లోకి దిగింది.

ఈ తప్పుడు పద్ధతు లవలంబించిన వారినిగురించి ఈరోజు ఆంధ్ర ప్రజానీకం ఏమనుకుంటుంది ?

ఈ దుష్ప్రచారాన్ని ముసలిరైతులు కూడా అసహ్యించు కుంటు న్నారు. వెనకటి నిజమైన కాంగ్రెసు వాదులుగా నేటి కమ్యూనిస్టుల్ని భావించి గౌరవిస్తున్నారు. కాంగ్రెసు నాయకుల కంటేకూడా యెక్కువ ప్రజాసేవకులుగా కమ్యూనిస్టుల్ని గుర్తిస్తున్నారు. రైతుసంఘాలద్వారా రైతుయువకుల్ని త్యాగమూర్తులయిన ప్రజాసేవా నిరతులుగా తయారు చేయకపోయినట్లయితే తమ బిడ్డలు ఈ నాడు ఏవిధంగా వుండేవారో వారికి తెలుసు. యౌవనదశలో తేలికగా పట్టుబడే త్రాగుడు జూదం వ్యభి చారం మొదలయిన దురలవాట్లకు లోనై సొమ్మంతా వమ్ముజేసుకోకుండా పార్టీయేవిధంగా తమ బిడ్డల్ని సక్రమమార్గాన బెట్టిందో వారికి తెలుసు. ఆచరణపూర్వకమయిన కమ్యూనిస్టు సిద్ధాంతాలు తమ కుమార్తెల్ని ప్రజా సేవాసక్తి గల్గిన తల్లుల్లాగా, ఇంటిపనులన్నీ ముచ్చటగా చక్కబెట్టుకొనే గృహిణుల్లాగా, దైనందినకష్టాల్ని పోగొట్టుకోవడానికి మహిళాసంఘాల్ని నిర్మించి తోటి సోదరీమణుల అభ్యున్నతికోసం అనవరతం పాటుపడే ఆదర్శవనితల్లాగా ఏలాతయారుచేశాయో రైతులకుభాగాతెలుసు. గ్రామాల్లో

వచ్చే ప్రతిసమస్యను పరిష్కరిస్తూ కమ్యూనిస్టు లేవిధంగా విధి విరామాలు లేకుండా గ్రామక్షేమం కోసం పాడుపడుతున్నారో వారు కండ్లారాచూశారు. తమ జీవితావసర వస్తువులు సంపాయించుకోవడానికి కమ్యూనిస్టు లెన్ని విధాల తోడ్పడ్డారో వారికి స్వానుభవమైన సంగతి వైజ్ఞానికాభివృద్ధికోసం చక్కని కార్యక్రమాన్ని వేసుకొని యువకుల్ని ఏవిధంగా విజ్ఞానవంతులుగా, విద్యావంతులుగా, ఆరోగ్యవంతులుగా పార్టీ తయారు చేసిందో ప్రతిరైతుకు తెలిసిన విషయమే. కాబట్టే కమ్యూనిస్టులమీద జరిగే యీ దుష్ప్రచారాన్ని ముసలి రైతులుకూడా అసహ్యించుకుంటున్నారు.

ఇక రైతు యువకులా ? అసలే వేడిరక్తం. ఈ బూతుల ప్రచారం వింటూంటే వాళ్ళరక్తం ఉడుకెత్తిపోతూవుంది. "వృద్ధ నాయకుల కిప్పుడు కావాలసింది ఏదోవిధంగా తమ నాయకత్వం నిలబెట్టు కోవడమే గాని దేశసేవకాదు." అనే విషయం గ్రహించారు. "మాటకు ముందు నిర్మాణ కార్యక్రమమంటూ మాటిమాటికి గాంధీగారి పేరు జపిస్తూవుండటమేగాని జైళ్ళనుంచి విడుదలై బయటికివచ్చిన తర్వాత కమ్యూనిస్టుల్ని తిట్టడంతప్ప ఈ వృద్ధనాయకులు చేసిన ప్రజాసేవ ఈషణ్మాత్రం కూడా లేదు కాబట్టి ముందు వీరిని తొలగించాలి" ఇదే ఆవేశపరవశులయిన నేటి యువకుల నినాదం.

ఇక హరిజన కూలీలేమనుకుంటున్నారో చూద్దాం. గోవాడ సభలో యీ కాశేశ్వర్రావు యీ రంగాయేగా భోజనాల దగ్గిర హరిజనుల్ని దూరంగా వేరే కూర్చో బెట్టింది. గాంధీగారు ఆంధ్రదేశంలో సంచారం చేసిన తర్వాత ఏకాంగ్రెసు మీటింగులోకూడా హరిజనులకింత అన్యాయం జరగలేదు. "ఎప్పుడో తుప్పుపట్టిపోయిన తప్పుడు ఆచారాల్ని రంగా కాశేశ్వర్రావులు మళ్ళీ అమల్లోకి తీసుకరావడమేమిటి ?" ఇదంతాచూస్తూ వుంటే యెన్నోవందల సంవత్సరాలనుంచి కాశేశ్వర్రావులాంటి బ్రాహ్మణులు తమ సంఘానికి చేసిన అన్యాయం హరిజనులకు మళ్ళీ జ్ఞాపకం వస్తుంది. ఈ సాంఘిక దురాచారాల్ని పోగొట్టడానికి రైతుసంఘం ఒక వైపునుంచి యింతపనిజేస్తూవుంటే యీ కాంగ్రెసు నాయకులు మళ్ళీ తమల్ని అస్పృశ్యులుగా అదృశ్యులుగా వెనకటి యుగాలనాటికి తీసుకపోతున్నారని హరిజన సోదరుల హృదయంలో క్రోధాగ్ని ప్రజ్వలిస్తూ వుంది. "ఇలాంటి నాయకుల్ని తుడిచిపెట్టండి." యిదే వారి క్రోధోద్రిక్త హృదయాల్లోనుంచి వెలువడే నేటి నినాదం.

వృద్ధకాంగ్రెసు నాయకుల్ని గురించి ప్రజలేమనుకుంటున్నారో చూశాం. కాంగ్రెసు పేరు తప్ప నేడు వీరిలో మిగిలిన ప్రత్యేకత యేమీ లేదు. పోటీ సంఘాలు బెట్టాలని ప్రయత్నించి చూశారు. ప్రజల్లో రంగా గారికి, విద్యార్థుల్లో విద్యార్థికాంగ్రెసుకు, మంచిపలుకుబడివుంది అనుకునే గోవాడలో (గత ఏప్రిల్‌లో) జరిగిన సభకు తమ సర్వశక్తులూ ఉపయోగించినా పదివేలమంది కంటె ఎక్కువ ప్రజల్ని సమీక రించలేక పోయ్యారు. ఈ జిల్లాలోనే యీ మీటింగుకు సరిగ్గా పదిరోజులముందు జరిగిన తెనాలిసభకు 50,000 మంది ప్రజలు వచ్చారు. గతసంవత్సరం బెజవాడలో జరిగిన రైతుమహాసభకు లక్షమంది ప్రజలు వచ్చిన సంగతి అందరికి తెలిసిందే. ఈసంవత్సరం జరిగిన జిల్లాతాలూకా సభలకు మొత్తం రెండు లక్షలమంది రైతులు వచ్చారు. రంగాగారుకూడా యీ మధ్య చాలా మీటింగులు బెట్టారు. రంగాగారు తదితరులు బెట్టిన అన్నిమీటింగులు గలిపినా వాటికి హాజరయిన సభ్యులు యిందులో పదో వంతు కంటె ఎక్కువుండరు. ఇది ఉన్నపరిస్థితి. కమ్యూనిస్టులమీద అబద్ధాలు అపనిందలు వేయడంకంటె ఇకవారిచేతిలో మిగిలిన ఆయుధ మేమీలేదు. ఈ ఆయుధాన్ని ఉపయోగించడంవల్ల వచ్చేఫలితం ప్రతి గ్రామం రెండు కక్షలుగా చీలిపోవడమే. గూండాలు, పెత్తందార్లు, జమీం దారీ జోహుకుములు, ఒకపక్షం. నూతనచైతన్యంతో ముందుకువచ్చిన రైతాంగం రెండోపక్షం. మొదటి పక్షానికి ఎప్పుడు కాంగ్రెసు ముసుగు వేస్తారో - అప్పుడే రెండోపక్షం సహజంగా కాంగ్రెసుకు వ్యతిరేకమై పోతుంది క్రమంగా రైతాంగం కాంగ్రెసు సంస్థకే దూరమై పోతుంది. ప్రజాశత్రువులకు ఆశ్రయం యివ్వడంవల్ల పవిత్రమయిన కాంగ్రెసు అప కీర్తిపాలవుతుంది.

రౌడీపద్ధతులు అవలంబించడం దుష్ప్రచారం చేయడం ఇవి జస్టిస్‌పార్టీకే తగునుగాని కాంగ్రెసుకుతగవు. కాంగ్రెసుపేరుతో జస్టిస్‌పార్టీ పద్ధతుల నవలంబించి కమ్యూనిస్టుల్ని నాశనం చేయగల్గుదు మనుకోవడం కేవలంభ్రమ. ప్రజల్లో పాతుకుపోయి. ప్రజాబలంతో బలపడి, ప్రజలతో కలసి మెలసిపోయిన మా పార్టీని ఏవ్యతిరేక శక్తులు నాశనం చెయ్యలేవు.

"1930 జాతీయోద్యమంలోనే మా రాజకీయ జీవితం ప్రారంభ మయింది. మారుమూలల నున్నగ్రామాలకు సైతం కాంగ్రెసు జెండాని తీసికెళ్ళాం. కాంగ్రెసు ఉద్యమాన్నినిర్మించాం. కమ్యూనిస్టు సిద్ధాంతాల్లోనే

ప్రజల క్షేమం ఉందని గ్రహించాం. కమ్యూనిస్టుపార్టీలో సభ్యులుగా చేరాం. నేటికీ ప్రజలదృష్టిలో నిజమైన కాంగ్రెసువాదుగా మేం గుర్తింపబడుతున్నాం. ఉద్యమ నిర్మాతలుగా పార్టీమమ్మ తయారుచేసింది. జాతీయోద్యమాన్ని బలపరచాం. పోషించాం. సర్వశక్తులూధారబోసి పనిజేశాం. రైతుల న్యాయమయినహక్కులకోసం పోరాడేనిమిత్తం రైతుసంఘాన్ని నిర్మించాం. ప్రజల్లో దేశభక్తిని ప్రబోధించాం. ఎనిమిదిసంవత్సరాలనుంచి రైతుల హక్కులకోసం ముందుండి పోరాడుతున్నాం. రైతుబిడ్డలే నేడు పార్టీ, రైతుసంఘ అగ్రనైజర్లుగా అభివృద్ధి అయ్యారు. పార్టీమీద రైతుసంఘంమీద రైతాంగానికి అచంచల విశ్వాసముంది. దీన్ని ఏ వ్యతిరేకశక్తులు తొలగించలేవు. కమ్యూనిస్టుపార్టీని రైతాంగం తమ బిడ్డలపార్టీగా భావిస్తూవుంది. కమ్యూనిస్టుపార్టీమీద బూతులు ప్రచారం చేయడమంటే రైతాంగం తమ బిడ్డల్ని తిట్టినట్లే ఎంచుతుంది ఆంధ్ర రైతు ఎన్నడూ దీన్నిసహించడు.

ఎటువంటి బూతుల ప్రచారంకూడా ప్రజలనుంచి మమ్మల్ని వేరు చేయలేదు. కాని సక్రమమైన ప్రజాస్వామిక విధానాన్ని సాఫీగాసాగిపోనివ్వకుండా ఆటంకాలు కలిగిస్తారు. ఈ విధంగా కమ్యూనిస్టు వ్యతిరేకులంతా కాంగ్రెసు నామధారులయితే మన ఆంధ్రదేశానికి ముందింకా దురదృష్టపు రోజులు తప్పవన్నమాట. దెబ్బలాటలు యింకా తీవ్రమౌతాయి. మేమెప్పుడూ మిగిలి ముందుగా చేయిచేసుకోం. కాని మమ్మల్ని మేము తప్పకుండా కాపాడుకుంటాం. సోదర దేశభక్తులతో మేమెప్పుడూ దెబ్బలాటకు దిగం, కాని మామీద బూతుల ప్రచారాన్ని మాత్రం జరగనివ్వం. జాతీయజీవితాన్ని విచ్ఛిన్నం గానివ్వం. మామీద జరుగుతూ వున్న బూతుల ప్రచారాన్ని ప్రజలకు తెలియజేస్తాం. నచ్చజెప్పుతాం. అందులో వున్న గుట్టును యింకా స్పష్టంగా బట్టబయలుచేసి చూపెడతాం. పరిస్థితులేవిధంగా నానాటికి దిగజారిపోతున్నాయో ప్రతిదేశభక్తుడూ గుర్తించేటట్లు చేస్తాం.

ఈ తగాదాల్ని కమ్యూనిస్టు వ్యతిరేకులు కాంగ్రెస్ కమ్యూనిస్టు తగాదాలుగా చిత్రిస్తున్నారు. కాని ఇవి వాస్తవానికి అవినీతులమధ్య గౌరవనీయులమధ్య, ప్రజాసంఘాల విచ్ఛిన్నకులమధ్య నిర్మాతలమధ్య, అభివృద్ధి నిరోధకులమధ్య అభివృద్ధి కాముకులమధ్య జరిగే సంఘర్షణలు.

ఈ అసహ్యకరమైన బూతుల ప్రచారాన్ని ఖండిస్తూ 70 సంవత్స

గాల వయోవృద్ధులు, సుప్రసిద్ధ కాంగ్రెసువాదులు శ్రీ గాడిచర్ల హరిసర్వో త్తమరావుగారు యిలా అన్నారు.

" కమ్యూనిస్టులు ఆంధ్రప్రజానీకానికి అనేక విధాల సేవ జేస్తూ వున్నారు. అటువంటి ప్రజాసేవకుల్ని కాంగ్రెసులోనుంచి ఎందుకు బైటకి వెళ్ళగొట్టడం ? ఆ ప్రజాసేవకులకు తోడ్పడేదానికి బదులు ఎందుకు వారిని తిట్టిపోస్తారు ? ప్రజాశత్రువులు మొట్ట మొదటినుంచి ప్రతి కాంగ్రెసు నాయకుణ్ణి చివరకు గాంధీగారినికూడా యిలాగే తిట్టి పోసేవారు. కాంగ్రెసు మహిళా వాలంటీర్లను గురించికూడా అవినీతికర ప్రచారం జేసే వారు. ఆనాడు ఈ అవినీతికర ప్రచారాన్ని ఏవగించుకొన్నవారే ఆంధ్ర మహిళామణుల అభ్యున్నతికోసం పాటుబడే కమ్యూనిస్టు స్త్రీలను గురించి యీనాడు బండబూతులు ప్రచారం చేయడానికి కూడా జంకటంలేదు. ఇదంతా చూస్తే నాహృదయం పరితపించి పోతూవుంది. "

కాని ఇలాంటివారు చాలాకొద్దిమంది. వీరి హెచ్చరికలు యింకా కాంగ్రెసువాదుల చెవులదాకా చేరటంలేదు. ఈవిషమ పరిస్థితుల్లో ఆంధ్ర కాంగ్రెసు నాయకులు ఆంధ్రేతర కాంగ్రెసు నాయకులు జోక్యం కలిగించు కుంటే కాంగ్రెసు పేరుప్రతిష్ఠల్ని నిలబెట్టొచ్చు.

తమ నాయకత్వం ఎక్కడ పోతుందో అనే కంగారుతో యీ వృద్ధనాయకులు యింతగా తెగించి పోరాడుతున్నారు. కాని మేము వారి నాయకత్వాన్ని కాదని తోసిపుచ్చటంలేదు. పీడిత ప్రజలకోసం కలసి పని చేద్దాంరండి అనే మేం వారిని కోరుతూవుంది. ఒకవేళ మీరు వృద్ధాప్యం వల్ల అలసిపోయి కలసి పనిచేయలేకపోతే కనీసం ప్రజాసేవ చేస్తూవున్న యువకులకు తగినంత ప్రోత్సాహమైనా యివ్వండి. అవినీతికర ప్రచారా నికి మాత్రం తోడ్పడకండి. ఇదే మేం కాంగ్రెసు పెద్దలకు జేసే వినయ పూర్వకమయిన విజ్ఞప్తి. 1944 మార్చిలో బెజవాడలో జరిగిన అఖిల భారత రైతుమహాసభా వేదికనుంచి జోషీ ప్రతి దేశభక్తుని హృదయానికీ హత్తుకుపొయ్యే చక్కని విజ్ఞప్తి చేశాడు.

" మాకూ, వారికీ–మీరే-ప్రజలే తలిదండ్రులు, వారు మాచేతినందు కొనేలా మాకు తోడ్పడేలా మీరు చేయాలి–మీరే చేయగలరు. మీ కొమా రులు, కొమార్తెలు అయిన మేము చేస్తున్న కృషికి మీరు సంతోషిస్తున్న ట్లయితే మా అన్నలు మా విజ్ఞప్తిని - దేశభక్తితో చేస్తున్న విజ్ఞప్తిని, ఆలించేలా చెయ్యాలి. ఇన్నాళ్ళనుంచి మేంచేస్తున్నపనిని వారికంటె

(కాంగ్రెసువాదులకంటె) మీరే ఎక్కువగా ఎరుగుదురు. ఈ నాడు మన భుజాలమీద ఎంతోభారంవుంది. ఇంకెంతో చేయాలసినపనివుంది. ఇదంతా మేం ఒక్కళ్ళమే చేస్తామని — చేయగల్గుదుమని మేము చెప్పటల్లేదు. అయినప్పటికి మా బొందిలో వూపిరి ఉన్నంతవరకు మాపని మేము చేస్తూనేవుంటాం. కాంగ్రెసువాదులు కమ్యూనిస్టులు చేయి చేయి గలపి ముందుకు నడిస్తే ఏశక్తులు అడ్డగించలేవు. మన కండ్లముందు మనము చూస్తూవుండగానే ఒక నూతన ప్రపంచం నిర్మించబడుతూవుంది. మనం అందరం ఏకమై యీ నూతన ప్రపంచంలో నూతన భారతదేశంలో స్వతంత్ర నూతన ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించుదాం"

కాని కాంగ్రెస్ నాయకులు దీన్ని లక్ష్యం చెయ్యలేదు. ఇంతకూ మేం జెప్పేది ఒకటే. మనలో మనకు రాజకీయ భేదాభిప్రాయాలుంటే అన్నదమ్ముల్లాగా కలసి చర్చించుకుందాం రాండి. ఒకవేళ మనం ఏకాభిప్రాయానికి రాలేని విషయాలేమయినా వుంటే వాటిని ప్రజలముందు బెడదాం పట్టండి. ప్రజలే నిజమయిన న్యాయాధికారులు.

"ఉభయులంకలిసి ప్రజలముందుకు వెళ్లదాంరాండి" అని మేం కాంగ్రెసు వాదుల్ని ప్రార్థిస్తున్నాం. కాని యిందుకు వారు అంగీకరించటల్లేదు. మా సాహిత్యం చదవడానికిగాని, కలిసి చర్చించడానికిగాని, వారు సిద్ధంగాలేరు. ప్రజాస్వామిక పద్ధతుల నన్నిటినీ వారు తోసిపుచ్చుతున్నారు. నేడు వారు ప్రజాస్వామిక వాదులు గారు. అవినీతి ప్రచారకులు. అసత్యవాదులు. విచ్ఛిన్నకులు మాత్రమే.

ఆంధ్ర రాష్ట్రంలో జగుతూవున్న పోరాటాలు కాంగ్రెసు కమ్యూనిస్టుల మధ్యకాదు. రాజకీయనిరంకుశ విధానానికి ప్రజాస్వామిక విధానానికి, అధికలాభాసక్తికీ ప్రజాసేవకీ, విచ్ఛిన్నతకీ నిర్మాణానికీ మధ్య జరుగుతూవున్న సంఘర్షణలు.

నిజమయిన కాంగ్రెసు వాదులే వక్రమార్గాన్ని బట్టిన రాజకీయాల్ని సక్రమమైన మార్గాన బెట్టగలరు. —తప్పకపెడతారుకూడా; అసలు విషయాలు ప్రజలందరు తెలుసుకోగలందులకు కమ్యూనిస్టు వ్యతిరేకుల నగ్న స్వరూపమేమిటో పైనున్న ముసుగు తొలగించి చూపెట్టవలసివచ్చింది. నిర్మొగమాటంగా మావిషయాలన్నీ ఇకరులకు జెప్పడానికి, ఇతరులుచెప్పితే ఓపికగా వింటానికి కలిసి పనిచేయడానికి మేమెప్పుడూ,సిద్ధమే.

అ ను బం ధ ము

# కమ్యూనిస్టు వ్యతిరేకుల విచ్ఛిన్న చర్యలు

ఈ నాడు కాంగ్రెసువాదులు పాల్గొనే ప్రతిసభలోనూ—అదిఎన్నికల సభకానీయండి, విద్యార్థుల సమావేశం కానీయండి, మరేది కానీయండి—ప్రస్తుత సమస్యలగూర్చిగాని, కాంగ్రెసు కార్యక్రమాన్నిగూర్చిగాని ఉండే ఉపన్యాసాలకన్నా కమ్యూనిస్టులను దూషించటమే ఎక్కువగా ఉంటుంది. ప్రధాన కాంగ్రెసు నాయకులు జైళ్ళలో వున్నప్పుడు ఆంధ్రలో కాశేశ్వర రావు, రంగా, చంద్రమౌళి, కల్లూరి సుబ్బారావుగార్లు ఈ నీచప్రచారాన్ని సాగించటంలో ప్రధానపాత్ర వహించారు. కాని రాష్ట్ర కాంగ్రెసు నాయకులగు ప్రకాశం, పట్టాభిగార్లు జైలునుంచి రాగానే, ఈ దుష్ప్రచారం అరికట్టబడుతుందనీ, రాష్ట్రాన్ని నాశనం చేస్తూన్న దొంగవ్యాపారాన్ని, కరువు కాటకాలనూ, లంచగొండి తనాన్నీ ఎదుర్కొనుటకై కాంగ్రెసు శక్తి మళ్ళించబడుననీ ఆశించాము. అందుకై దేశభక్తులనందరనూ ఏకం జేసి ముందుకు నడిపిస్తారనీ ఆశించాము. కాని ఈ నాయకులు అట్టి విశాల భావాన్నికనపర్చలేదు. 3 సంవత్సరాలకుపైగా జైలులోనున్నందువల్లబైటకు రాగానే, దేశపరిస్థితులను సింహావలోకనం జేసుకొని వాస్తవమును గుర్తించుటకు బదులుగా, కాంగ్రెసులో వ్యాపించిన అంతఃకలహాలను మాన్పి ప్రత్యక్ష సమస్యలను పరిష్కరించుటకై అందరనూ కూడగట్టి నడిపించుటకు మారుగా తెలిసీ తెలియని సమాచారంపై ఆధారపడి ప్రకటనలు గావించటం ప్రారంభించారు. తమ అనుచరులిచ్చిన భోగట్టాతో కమ్యూనిస్టులపై, నిజానిజాలను తెలిసికోకుండా నిందలు వేయటం సాగించారు. అన్నిటికంటె ముఖ్యంగా కమ్యూనిస్టులు దౌర్జన్యంగా కాంగ్రెసువాదులమీదపడి కొడుతున్నారనీ,కర్రలు,కత్తులు,బరిసెలు వుపయోగించుతున్నారనీ ప్రతిమీటింగులోనూ, ప్రకటనలోనూ చెప్పటంసాగించారు. ప్రకాశంగారు బైటకువచ్చి రావటంతోనే "కమ్యూనిస్టులు గతమూడేండ్లుగా చేసిన చేష్టలు చూస్తే వాళ్ళకు యిప్పుడు ఖండితంగా కాంగ్రెసులో స్థానం లేదు. కృష్ణాలోనూ, గోదావరిజిల్లాలోనూ తలకాయలు పగులుతున్నాయనీ, ఎముకలు ఇరుగుతున్నాయని పట్టాభి చెప్పాడు. నేను బయటవుంటే ఇది సహిస్తానా? వాళ్ళు అట్లా చెయ్యగలిగేవాళ్ళా?" అని నిజానిజాలు తెలిసికో

కుండా ప్రకటించారు. బందరు సభలో పట్టాభిగారు "ఇదివరకు మీరు వత్తాసు యిచ్చారు కాబట్టే కమ్యూనిస్టులు విజృంభించారు. రేపటినుండీ వారి ఆటలుసాగవు" అని చెప్పారు. ప్రకాశంగారు కర్నూలులో మాట్లాడుతూ "కమ్యూనిస్టులు కొన్నిచోట్ల ప్రజలను కర్రలతోనూ బరిసెలతోనూ పొడిచి రక్తం పారించినట్లు నాకువార్తలు వచ్చినవి. ఇదంతా చాలక వీరు ఎన్నికలలో నిలుస్తున్నారు." అని పల్కారు. ఈ విధంగా కమ్యూనిస్టులపై కొన్నివిసురులు విసరటమేగాని, కమ్యూనిస్టులకు సంబంధమున్న దెబ్బలాటలు ఎందుకు వచ్చాయి" ఎవరితో వచ్చాయి? కమ్యూనిస్టు వ్యతిరేకుల కాంగ్రెసు రంగు ఎటువంటిది? అన్న ఈ విషయాలను తెలుసుకొన ప్రయత్నించనేలేదు. అప్పుడు మొదలు పెట్టిన అసత్యనేరారోపణలను విడువకుండా ఇప్పటికీ సాగిస్తూనే వున్నారు.

ఈ ఆంధ్ర కాంగ్రెసునాయకుల దుష్ప్రచారానికి పక్కతాళం వేస్తున్నవా అన్నట్లుగా పత్రికలుకూడా తప్పుడు రిపోర్టులను ప్రకటిస్తున్నాయి. సత్యాన్ని మరుగుపర్చి, నిష్పక్షపాత బుద్ధిని విడనాడి కేవలం పాక్షిక వార్తలనే ప్రకటించటం ప్రారంభించాయి. ఏరి ఏరి కమ్యూనిస్టు వ్యతిరేక వార్తలను ప్రచురించటం, కమ్యూనిస్టుల ప్రకటనలను అణచివేయటం జరుగుతోంది. ఈవిధంగా జాతీయ జీవనంలో తమకు గల మహోన్నత స్థానాన్ని మలినం జేసుకుంటున్నాయి. ఆంధ్రలో జాతీయభావాలను వెదజల్లుటకూ, ఆంధ్రోద్యమాన్ని పెంపొందించుటకూ, సంఘసంస్కరణకు తోడ్పడుటకూ ప్రథమంలో పత్రికలు తాము చేసిన కృషిని మర్చిపోయి, ఆంధ్రలో బ్రహ్మాండంగా అభివృద్ధి చెందుతున్న ప్రజావుద్యమాలను సరిగా ప్రతిబింబించకుండా, ఆంధ్రజాతియొక్క పత్రికలుగా కాకుండా కమ్యూనిస్టు వ్యతిరేక ఆయుధాలుగా మాత్రమే ఇవి నిర్వహింపబడుతున్నవి. కీర్తిశేషులగు కందుకూరి వీరేశలింగం, కాశీనాధుని నాగేశ్వరరావు, ముట్నూరి కృష్ణారావుగార్లు ఏర్పర్చిన సుసాంప్రదాయములనూ, పత్రికా గౌరవములనూ విడనాడి కేవలం వ్యాపార పద్ధతులపై నడుపు పత్రికాధిపతుల స్వంత పత్రికలుగానే నడపబడుతున్నాయి.

## నిజమేది? అబద్ధమేది?

ఆంధ్రరాష్ట్రంలో ఈ తగాదాలు సుమారు 2 సంవత్సరాలుగా జరుగుతూవున్నాయి. అప్పటినుండీ కాంగ్రెసు నాయకులూ, పత్రికలూ యీ

తగాదాలనుగూర్చి దుష్ప్రచారాన్ని గావిస్తూవచ్చారు. అన్నింటిలోనూ కమ్యూనిస్టులే దౌర్జన్యాలను జరిపారనీ, కాంగ్రెసువాదుల తలకాయలు పగిలాయనీ ప్రచారం చేస్తూవచ్చారు. కాని నిజానిజాలు ఎప్పటికప్పుడు ప్రజాశక్తిద్వారా ఆంధ్రప్రజానీకమునకు తెలియ జేయబడుతూనే వున్నవి. అయినా కాంగ్రెసునాయకులు ఎన్నికల ప్రచారంలో మిగతా విషయాలన్నిటినీ తేల్చివేసి కమ్యూనిస్టులపై నిందలను గూర్చియే ఎక్కువగా ముచ్చటించుచుండుటచే తిరిగి ఒకపర్యాయం ఈ విషయాలను గూర్చి సత్యమును తెలియజేయవలసి వస్తోంది. గత 2 సంవత్సరాల పాత పురాణాన్ని ఇంత వరకు చూచాం. ఎన్నికల ప్రచారం ప్రారంభమైన పిమ్మట జరిగిన సంఘటనలనూ, ఏవిధంగా కాంగ్రెసువాదులే, ప్రచారానికి బదులు దౌర్జన్యాలనే ఎన్నికలలో సాధనంగా తీసుకుంటున్నారో తెలియజేస్తున్నాము.

కమ్యూనిస్టుపార్టీ ఆంధ్రకమిటీ విస్తృత సమావేశం సెప్టెంబరు ఆఖరువారంలో జరిగింది. అప్పటినుండీ కమ్యూనిస్టుల ఎన్నికల ప్రచారం ప్రారంభమైంది. ప్రతిసభలోనూ కమ్యూనిస్టుపార్టీ ఎన్నికల ప్రణాళికను గూర్చి వివరాలతో వుపన్యాసాలీయబడేవి. వేలాదిజనం, ఎన్నడూ ఏ బహిరంగసభకూ రానంతమంది ఎక్కువగా ఈ సభలకు హాజరౌతున్నారు. ఉదాహరణకు అవనిగడ్డ సభకు (5-11-45) 8000 మంది, కూచిపూడి సభకు (6-11-45) 15,000 మందీ గుడివాడ సభకు (7-11-45) 20,000 మందీ, గన్నవరం సభకు (8-11-45) 7000 మందీ, వీరంకిలాకు సభకు (11-11-45) 12,000 మందీ, అంగలూరు సభకు (13-11-45) 10,000 మందీ కంకిపాడు సభకు (15-11-45) 14,000 మందీ ప్రజలు హాజరైనారు. వీరిలో 4 వ వంతునుండి సగంవరకూ స్త్రీలు వుంటూవున్నారు.

గాంధీజీ ఆంధ్రదేశంలో సంచారం చేసినపుడుకూడా ఇంత హెచ్చుమంది ప్రజలు గ్రామాలలో జరిగే బహిరంగ సభలకు హాజరుకాలేదు. ఈ విధంగా వేలాదిజనం కమ్యూనిస్టుల సభలకు హాజరుకావటం, తమ సభలకు రాకపోవటం కాంగ్రెసు నాయకులకు కంటక ప్రాయమైంది. కాబట్టి దాదాపు ప్రతి కమ్యూనిస్టు సభనూ చెడగొట్టుటకు ప్రయత్నాలు జరిగాయి.

అవనిగడ్డలో 5-11-45 న కామ్రేడ్ సుందరయ్య ఉపన్యసించుటకై సభ ఏర్పాటు చేయబడింది. ఈ సభను చెడగొట్టుటకై గద్దె కృష్ణమూర్తి (స్థానిక కమ్యూనిస్టు వ్యతిరేకి) మున్నగువారు ఎంతో ప్రయత్నించారు. కాంగ్రెసు జండాలు పుచ్చుకొని గ్రామాలలో తిరిగి, ఈ సభలో

అల్లరులు జరుగుతాయి కాబట్టి ఎవరూ వెళ్ళవద్దని ప్రచారం చేసారు. అవనిగడ్డలో వాల్‌పోస్టర్లను చించేసారు. ఇవేమీ ఫలించకపోతే, ప్రభుత్వంచే నిషేధింప జేయుటకై పన్నాగం పన్నారు. అవనిగడ్డ రెవిన్యూ ఇన్‌స్పెక్టరు ఇంటికి నిప్పుపెట్టి, అది కమ్యూనిస్టులే చేసారన్నారు. (కేసు జరిగింది. కాని కొట్టివేయబడినది.) ప్రయోజనం శూన్యం. సభజరిగింది. 8000 మంది ప్రజలు హాజరైనారు. (అదేరోజున, అదే గ్రామంలో పెట్టబడిన ప్రకాశంగారి సభకు 500 మంది మాత్రమే హాజరైనారు.) ఇంత జనసమూహాన్ని చూసి అల్లరిచేయుటకు భయపడి, సభ అంతమగువేళ వేదికపైకి రాళ్ళురువ్వారు. 6-11-45 న కూచిపూడి సెంటరులో కామ్రేడ్ సుందరయ్య సభజరిగింది. ఈసభను చెడగొట్టాలనే వుద్దేశంతో ఇచ్చట కూడా, చుట్టుప్రక్కల గ్రామాలలో సభకెవ్వరూ వెళ్ళవద్దని ప్రచారం జరిగింది. ప్రయోజనం లేకపోగా, ఆనాడే సాయంత్రం 6 గంటలకు వున్న ప్రకాశంగారి సభను రాత్రి 8 గంటలకు - ముందుగానే, అదేవేళకు ఏర్పాటు కాబడ్డ సుందరయ్యగారి సభకు పోటీగా - మార్చారు. కాని ప్రకాశంగారి సభకు 1500 మందీ, సుందరయ్యగారి సభకు 15,000 మందీ హాజరైనారు. ఈ రెండు సభలలోనూ అనుభవాన్ని గుర్తించినందున గుడివాడలో 7-11-45 న వున్న కామ్రేడ్ సుందరయ్య సభను చెడగొట్టాలని తీవ్ర ప్రయత్నాలను గావించారు. ప్రకాశంగారే స్వయంగా కాంగ్రెసు సేవకుల సమావేశాన్ని జరిపి మాట్లాడారు. గుడివాడ సభకు 20,000 మంది ప్రజలకు పైగా వచ్చారు. సాయంత్రం 6 గంటలకు సభ ప్రారంభమైంది. సభ జరుగుతూవుండగా రౌడీల దుశ్చేష్టలు ప్రారంభమైనాయి. స్త్రీలను బండబూతులు తిట్టటం, రాళ్లురువ్వటం సాగించారు. 30 మంది స్త్రీ పురుషులకు దెబ్బలు తగిలాయి. ఈ రౌడీచేష్టల్లో ప్రముఖపాత్ర వహించినది కురుమద్దాలి కోటేశ్వరరావు, లుక్కా వెంకటపతి, మస్తానురావు, శ్రీశైలం, అట్లూరి వెంకటేశ్వరరావు, అట్లూరి సూర్యనారాయణ వగైరాలు. (వీరిలో చివరి ఇద్దరూ 1942 లో పట్టాలు ఊడబీకి, పోలీసులువచ్చుసరికి అప్రూవర్లుగా తయారైనారు.) ఈ రౌడీచర్యలన్నీ జరుగుతూవుండగా పట్టణ కాంగ్రెసు ప్రముఖుడగు కేతవరపు లక్ష్మీనరసింహారావుగారు స్వయంగా హాజరై, చూస్తూవున్నారు.

జరిగిన విషయమిదికాగా, పత్రికావార్తలు దీనినెట్లు తారుమారు చేసాయో చూడండి. " మధ్య మధ్య కాంగ్రెసును దూషణ చేస్తూన్నపుడు

ప్రజలు సహించలేక పోయారు. సమీప గ్రామాలలో టి. ప్రకాశంగారి పర్యటన సందర్భంలో కమ్యూనిస్టులు గల్లంతులు చేసారనీ వార్తలు ఒక రోజు ముందుగానే తెలిసినందువల్లనూ. రావులపాడు అనే గ్రామములో బలవత్తరంగా గాయపడ్డ ఒకకాంగ్రెసువాదిని గుడివాడ ఆస్పత్రిలో చేర్చడంచేత జనులు తండోప తండాలుగా వచ్చి చూచినందువల్లనూ కమ్యూనిస్టులయెడ అంతకు పూర్వమే ప్రజలలో వ్యతిరేక వాతావరణం ప్రబలి వుంది. ఇదే సమయానికి సభలో కూడ సుందరయ్యగారు కాంగ్రెసు దూషణను మొదలుపెట్టుటవిని ప్రజలు సహించలేకపోయారు. సభనుండి అసమ్మతి సూచకంగా జై నినాదాలు కొడుతూ లేవబోగా అల్లరి జరుగుచున్నదని వాలంటీర్లు కర్రలు పుచ్చుకొని వారికెదురుగా వెళ్లారు. ఆకంగారులో కొట్టుటకు వాలంటీర్లు రావటం జూసి కొందరు తిరగబడ్డారు. వాలంటీర్లు కర్రలతో మోది చాలామందిని గాయపర్చారు. అల్లరితో సభ ముగిసింది. ఇతర కార్యక్రమమంతా ఆపివేసారు." (8-11-45 ఆంధ్రప్రభ).

"పుచ్చలపల్లి సుందరయ్యగారు రష్యావిప్లవ చరిత్రను గురించి ద్వితీయ సంగ్రామంలో రష్యా భూమికను గురించి దీర్ఘంగా వుపన్యసించారు. కాంగ్రెసు ఎన్నికల గురించి ప్రసంగిస్తూ వుండగా కొందరు కాంగ్రెసుకు జై, గాంధీజీకి జై అని కేకలు వేయగా సుందరయ్యగారు ఉగ్రుడై, ఆ కాంగ్రెసు రౌడీలను అణచివేయడానికి మావలంటీరు దళం వెనుక గోడలాగావుంది మీకేమీ భయంలేదు. అని సభికులను హెచ్చరించారు. సభలో రాళ్ళుపడినవి ఇంతలో వర్షంవచ్చింది. కాని కొందరికి దెబ్బలు తగిలినవి. వీరిలోఅయిదుగురు విద్యార్థికాంగ్రెసు సభ్యులున్నారు" (ఆంధ్ర పత్రిక 14-11-45)

10-11-45 న గుంటూరులో బహిరంగసభ జరిగింది. సుమారు 5000 మంది ప్రజలు హాజరైనారు. కామ్రేడ్ సుందరయ్య ఈ సభలో వుపన్యసించారు. "అజాద్ హింద్ ఫౌజ్ జపాను సైన్యాలతో కలిసి దేశానికి స్వాతంత్ర్యం తెస్తామనుకోవటం తప్పు. అయినా వారిని విచారించేహక్కు బ్రిటీషు ప్రభుత్వానికిలేదు. వారిని విడుదల చేయాలి" అని వుపన్యాసంలో చెప్పారు. వెంటనే సభలో ఒకమూలనుండి అల్లరి బయలుదేరింది. "బోసుకు జై అజాద్ హింద్ ఫౌజ్‌కు జై కాంగ్రెసుకు జై" అని నినాదాలు అరుస్తూ ఎంతసేపటికి వూరుకోలేదు. ఈ విధంగా అల్లరి సాగిస్తూ వున్నవారిని వాలంటీర్లు సభనుండి దూరంగా తోసివేయవలసి

వచ్చింది. ఇందులో ఒక కుర్రవాడు వెనక్కు వెనక్కు జరుగుతూ ఒక స్థంభానికి కొట్టుకొనగా వానికి మాత్రం కొద్దిగా దెబ్బ తగిలింది. సభానంతరం ఇండ్లకు మరలిపోయేవారిని దారులు కాచి ఈ అల్లరిచేసిన రౌడీలు కొట్టారు డాక్టరు దామరాజు పుండరీకాక్షుడుగార్ని పడవేసి కొట్టారు. కొరిటపాడు, అరండల్‌పేటలకు వెళ్ళేవారిపై రాళ్ళవర్షం కురిపించారు. స్టూడెంటు ఫెడరేషన్ ఆఫీసును చుట్టుముట్టి "బైటకువస్తే చంపుతాము" అని లోనివారిని బెదిరించారు. బైటవున్న బోర్డును ఎత్తుకు పోయారు. అర్ధరాత్రివేళ కామ్రేడ్ షంషెర్ ఇంటిపైబడి బైటకొచ్చిన అతని తల్లిని తన్నారు. మరునాడు పట్టపగలు తాలూకాఫీసువద్ద అడ్వొకేటు ఉన్నవ గోపాలకృష్ణయ్యగార్ని కొట్టారు. ఈ విధంగా రెండురోజులు పట్టణంలో నానాభీభత్సమూ చేసారు. ఈఅల్లరులలో ప్రముఖపాత్రవహించినది ఎన్. ఆర్. కోటేశ్వర్రావు అనే రౌడీ, డాక్టరు చలపతిరావుగారి కాంపౌండరు గోపాలం.

కాని ప్రకాశంగారు దీనినేవిధంగా చెపుతున్నారు? "అజాద్‌హింద్ ఫౌజును గురించిన నినాదాలను చాటుతున్న చిన్నకుర్రవాడిని ప్రశంసించే దానికి మారుగా కమ్యూనిస్టులు కొట్టారని వినడం నాకే ఆశ్చర్యంగావుంది పండిత జహ్వారిలాల్ చెప్పిన మాటలనే ఆకుర్రవాడు అని వుంటాడు. కమ్యూనిస్టులు తాము చేసిన పనికి సిగ్గుపడవలసింది. ఎన్నికలలో దౌర్జన్యంఎంత మాత్రం పనికిరాదని గ్రహించి కమ్యూనిస్టులు తమ పంథాను మార్చుకోవాలి. (ఆంధ్రప్రభ 15-11-45)

సిగ్గుపడవలసిన దెవరో నిజవిషయాలను తెలుసుకొంటే ప్రకాశం గారే చెప్పగలరు?

మంతెన వెంకట్రాజుగారు గుంటూరుజిల్లా కాంగ్రెడునాయకుడు. వారి ప్రకటనలో ఏమిచెప్పారోచూడండి. "గుంటూరులో ఒక కుర్రవాడు పుచ్చలపల్లి సుందరయ్యగారు అజాద్ హింద్‌ఫౌజునుగురించి విమర్శించు చుండగా ఆ మాటలు వినలేక "మీరు దేశభక్తులేనండీ" అని అన్నాడట. ఇంతలోనే సుందరయ్యగారు వాలంటీర్లను పిలవగానే వారు దబ దబ ఆ చిన్నకుర్రవాడిని చావమోదినారు. అందువల్ల గోలైనది. తరువాత జరిగిన దెబ్బలాటలకు కారణమైనది వీరి నిరంకుశ అత్యాచారపద్ధతి"

గుంటూరులో ప్రజలముందు నిలబడి చెప్పగలరా ఈమాటలనే వెంకట రాజుగారు.

అల్లరు లీ రెండుమూడుసభలలోనేకాదు. చాలాసభలలో జరిగినవి. 14-11-45 న తెనాలిలో కమ్యూనిస్టుపార్టీ సభ ఏర్పాటుజేయబడింది. కామ్రేడ్ సుందరయ్య ఈ సభలో ఉపన్యసించారు. సభకు 10,000 మంది ప్రజలు హాజరైనారు. కామ్రేడ్ సుందరయ్య ఉపన్యసిస్తూ వుండగానే కాంగ్రెసు ఏర్పాటుజేసిన సభనుండి తిరిగివస్తూన్న కాంగ్రెసు వాలంటీర్లు, కావాలని ఈ సభకువచ్చి గోలచేయటం, రాళ్ళు రువ్వటం చేశారు. 15-11-45 న కంకిపాడులో కామ్రేడ్ సుందరయ్య వుపన్యాసం ఏర్పాటు చేయబడింది. దానిని చెడగొట్టాలనే వుద్దేశంతో కంకిపాడు చుట్టుపక్కల గ్రామాలలో హఠాత్తుగా ప్రకాశంపంతులుగారి సభలు ఏర్పాటు జేయబడినవి. అయినా కంకిపాడుసభకు 14,000 మంది ప్రజలు హాజరైనారు. సభానంతరం ఉప్పులూరు, వేల్పూరు వగైరా గ్రామప్రజలు బండ్లు కట్టుకొని వెళ్ళుచుండగా బండ్లలోని స్త్రీలను బండబూతులు తిట్టుతూ రాళ్ళు విసిరికొట్టారు. 9-11-45 న చిలకలూరిపేటలో బహిరంగసభ ఏర్పాటు కాబడింది. సభకు పూర్వమే ఏర్పాట్లను గావిస్తున్న అనిశెట్టి సుబ్బారావుగారి పైబడి చొక్కా చింపేశారు. ప్లాటుఫారమును పీకివేసారు. సభ ప్రారంభం కాబోయే వేళలో అల్లరి మితిమీరి చేయటం సాగించారు కాబట్టి సభను జరుపుటకే వీలులేకపోయింది. 7-11-45 న అనకాపల్లిలో మార్కెట్టు దొడ్డిలో రష్యా విప్లవదినోత్సవం జరుపుతువుంటే అల్లరి సాగించారు. కామ్రేడ్ గోవిందరావు కళ్ళలోనూ, ప్రజలపైనా ఇసుక కొట్టారు. సభను నిర్విఘ్నంగా జరుపుటకే వీలులేకపోయింది. తిరిగి వెళ్ళుచున్నప్పుడు కామ్రేడ్ మణిపైకూడా అత్యాచారాలు గావించారు. బందరులో 11-11-45 న టౌనుహాలులో సభ జరిగింది. 4000 మంది ప్రజలు హాజరైనారు. ఇక్కడకూడా విద్యార్థి కాంగ్రెసు వ్యక్తులు 'కాంగ్రెసుకుజై, బోసుకుజై' అంటూ గల్లంతుచేశారు. వేదికమీదికి రాళ్ళుకూడా రువ్వారు. రేపల్లెలో కమ్యూనిస్టుపార్టీ అభ్యర్థి మాకినేని బసవపున్నయ్య ఊరేగింపులో వెళ్ళుతూవుంటే గాజును పైకి విసిరారు. కొల్లూరులోజరిగే జిల్లావ్యవసాయకూలీ మహాసభకువెళ్ళే వ్యవసాయకూలీలను క్రాపలోనూ, జంపనలోనూ కాంగ్రెసువాదులే అడ్డగించి ఎఱ్ఱజండాలను తీసివేస్తానికి ప్రయత్నించారు. వేమూరులో చిన్న పిల్లలచే ఇసుక

చల్లించారు. గోవాడ కమ్యూనిస్టు వ్యతిరేకులకు కేంద్రం. ఈగ్రామములో కమ్యూనిస్టుపార్టీ సభజరుపుదామనుకుంది. వీలులేదన్నారు గ్రామకాంగ్రెసు పెద్దలు. ఒకఇంట్లో కొద్దిమందితో సభజరుపుదామని ప్రయత్నిస్తే అదికూడా వీలుకాదన్నారు. ఈవిషయాన్ని గ్రామమునసబుతో సంప్రదించుటకై పరుచూరి రంగారావు, రమణయ్య, శ్రీనివాసరావు అనే ముగ్గురు కామ్రేడ్స్‌వెళ్లారు. ఆయనతో మాట్లాడుతూవుండగానే గాంధిమహాత్మునికి జై, దేశద్రోహులు నశించాలి, జోషీ ముఠా డౌన్‌డౌన్ అనుకుంటూ 35 మంది కర్రలతోనూ దీపాలతోనూ వూరేగారు. కామ్రేడ్స్ మునసబుగారితో మాట్లాడి బయటకు వస్తూవుండగా అరుగులమీద పొంచివున్న పావులూరి ఆనందయ్య, సుబ్బయ్య, మరొకరు కామ్రేడ్స్‌పై బడి కొట్టిపారిపోయారు. శ్రీనివాస రావుకు పక్కటెముకలపై బలమైన గాయాలు తగిలాయి. రమణయ్యకు తలపగిలింది. రంగారావుకు తలచిట్లింది. మాడుమీద బలమైన గాయాలు తగిలాయి. లింగవరంలో కమ్యూనిస్టులనూ, పార్టీ సానుభూతిపరులనూ, చాటుమాటున, ఒంటరిగాచూసి కొట్టటం పరిపాటి అయిపోయింది. అదే విధంగా 25-11-45న కొండపల్లి పరశురామయ్యగారు (కృష్ణాజిల్లాకమ్యూనిస్టు కమిటీ సభ్యుడైన శీతారామయ్య గారితండ్రి) పొలాలకు వెళ్ళుచుండగా. ఉదయమే కొట్టారు. వారికి బలమైన దెబ్బలు తగిలాయి.

భీమవరంలో రామారావు, రామచంద్రరావులనేవారు మరి 10 మంది రౌడీలతో కలిసివచ్చి కామ్రేడ్స్ వంక సత్యనారాయణ, కోటిపల్లి అప్పన్నగార్లపైబడి కత్తితో పొడవబోయారు. వీరే ప్రజాశక్తి పుస్తకాల డిపోపైకూడా పడి అచ్చటి కామ్రేడ్స్‌ను కొట్టారు.

కమ్యూనిస్టుపార్టీవారి మీటింగులకు కాంగ్రెసువారు వెళ్ళి వారినాయకులకు ఆహ్వానములివ్వలేదు. వారిని ప్రశ్నలు వేయలేదు. అటులచేయరు. అని మంతెన వెంకట్రాజుగారు తమ ప్రకటనలో తెలియ జేసారు. యీ పైదురంతాలన్నీ ఎవరు చేసినవో, ఎందుకు చేయబడినవో, వెంకట్రాజు గారు తెలియచేయగలరా? ఆ దురంతాలు చేసిన వ్యక్తులు కాంగ్రెసు వాదులు కారని వారు చెప్పగలరా?

కమ్యూనిస్టుపార్టీ సభలను అల్లరి చేయటం, ఆ సంఘటనలను వక్రరూపంలో చూపటమేకాదు; ప్రతి ఇతర సంఘటననూ ఈ కాంగ్రెసు నాయకులూ, జాతీయ పత్రికలూ వక్రరూపములో చూపటం సాగుతున్నది.

ఎక్కడ ఏచిన్న సంఘటన జరిగినా దానిని కమ్యూనిస్టులకు ముడిపెట్టి తిట్టటం జరుగుతోంది. ఇందుకు అనేక నిదర్శనాలు వున్నాయి.

4-11-45 న రాజమండ్రిలో కామ్రేడు సుందరయ్య సభ జరిగిన అనంతరం 6-11-45న యువజనకాంగ్రెస్ యాజమాన్యాన బహిరంగసభ జరిగింది. అందులో భూపతి కోటేశ్వరరావు అనేకపచ్చి అబద్ధాలు పల్కి "సమాధానం చెప్పగల మగకమ్యూనిస్టు ఎవడైనావుంటే రమ్మనండి" అని సవాల్ చేశాడు. రాజమండ్రి పట్టణజట్ల కార్మిక సంఘకార్యదర్శి, కామ్రేడ్ చిట్టూరి ప్రభాకర చౌదరిలేచి తనకు 5 నిముషాలు వ్యవధియిస్తే జవాబు చెప్పుతానన్నాడు. వెంటనే అధ్యక్షుడుగా కూర్చున్న పతానేని విశ్వేశ్వర్రావు మైక్ ద్వారా "వలంటీర్లూ, నేను చెప్పినపనులు నిర్వర్తించండి. మీరు నలుమూలలా సర్దుకోండి." అని నాలుగుసార్లు హెచ్చరించాడు. ఏందుకా అని ప్రజలు చూస్తూవుండగానే రాళ్లువచ్చి పడసాగాయి. ఇంకేంకావాలి? కమ్యూనిస్టులే రాళ్ళను రువ్వుతున్నారని కేకవేసి డాక్టరు ఎ. బి. నాగేశ్వర్రావుగారు చౌదరిని వేదికవద్దకు ఈడ్చుకవెళ్ళగా వాలంటీర్లు బాగాకొట్టారు. చౌదరి వెముకలు పగిలి నెత్తురు కారింది.

ఈ నిజవార్తను ఏ పత్రికా ప్రకటించలేదు. కాని దీనినే కమ్యూనిస్టులు అల్లరి చేశారని ప్రకటనలు మాత్రం పెద్దవిగా ప్రకటింపబడ్డాయి. "రాజమండ్రిసభలో దౌర్జన్యం!" అన్న శీర్షికతో ఆంధ్రపత్రికలో ఒకవార్త ప్రకటింపబడింది. "రాజమండ్రిలో నిన్న ఆంధ్రరాష్ట్ర యువజన మహాసభ ఆర్గనైజరగు భూపతి కోటేశ్వర్రావుగారు, ఏర్పాటుజేసిన ఒక యువజన సభలోకోటేశ్వర్రావుగారు ఉపన్యసిస్తుండగా సుమారొక 20 నిమిషముల వరకూ సభలోచాలా అల్లరి జరిగెను. కాని వాలంటీర్లు తిరిగి అల్లకల్లోలమును శాంతింపజేసిరి. తర్వాత సభ శాంతంగానే జరిగెను. 1942 ఆగస్టు మాసమునుండియూ కమ్యూనిస్టులు ఏ యే విధంగా ప్రవర్తించిరో విమర్శిస్తూ వారి ప్రవర్తనను గర్హిస్తూ సభలో కొందరు ఉపన్యసించారు. ఈ విధంగా కమూనిస్టుల చర్యలను ఖండించుచు ఉపన్యాసకులు మాట్లాడియుండిన సభలో అల్లరులు చెలరేగి రాళ్ళురువ్వబడెను. 8 సం॥ ల బాలికకు చాలాతీవ్రగాయములైనవి." అన్నది విలేఖరివ్రాత.

"భూపతికోటేశ్వర్రావుగారు, మాట్లాడుచూ కమ్యూనిస్టుల చర్యలను ఖండించుచూ కొన్నిసవాళ్లుచేసిరి. ఆ సవాళ్ళకు కమ్యూనిస్టులెవరైనా సమాధానమియ్యవచ్చుననిరి. అప్పుడు సభలోనుంచి ఒక కమ్యూనిస్టులేచి తనకు

5 నిమిషములు వ్యవధియిచ్చిన సమాధానమిచ్చెదననిరి. ఇంతలో అధ్యక్షులు లేచి సమాధానములకు వుపన్యాసముల అనంతరము అవకాశమియ్యబడు ననియు సందేహములు వున్నవారు సభలో కేకలువేయుటకన్న లిఖితపూర్వ కముగావ్రాసియిచ్చిన సమాధానమివ్వబడుననియూచెప్పిరి. ఇంతలో కమ్యూ నిస్టులు నాల్గుమూలలనుండి కేకలు వేయుచూ వేదికపైకి రాళ్ళు రువ్వనా రంభించిరి. ఒక రాయి వచ్చి శ్రీ డా॥ కె. యల్. నరసింహారావుగారి ఖాదీ మహిళా శిక్షణ శిబిరంలో శిక్షణపొందుతున్న అత్తిలి పద్మావతి యను 8 ఏండ్ల బాలిక నుదిటిపై తగిలి బలమైన గాయమైనది. వెంటనే ప్రధమచికిత్స చేయబడినది. నామీదకూడ రాళ్లుపడినవి" అని డాక్టరుగారి భార్య కాశీభట్లవెంకట రమణమ్మగారి ప్రకటన.

(15-11-45 ఆంధ్రపత్రిక)

సరేకాని, భూపతి కోటేశ్వరరావు యువజనకాంగ్రెస్‌వారు ఏర్పాటు జేసి, చేయించిన అల్లరిని కమ్యూనిస్టులపై మోపటం, చౌదరిని కొట్టిన విషయాన్నే తలబెట్టకపోవటం, గాంధీజీ శిష్యు లనుకొనే ఇట్టి కాంగ్రెసు వాదులకు చెల్లుతోంది!

రావులపాడులో గోపాలస్వామి అనే వ్యక్తి ఒక డున్నాడు. ఆయన లోతు పాతులూ, విలువా, కాంగ్రెసుసేవా అక్కడి ప్రజలందరికీ తెలిసినవే. అత డొకరోజున కాల్వగట్టుమీద కూర్చొని పళ్ళు తోము కొంటూ దారిని కట్టేసాడు. ఇద్దరు ముగ్గురు కమ్యూనిస్టులు దోవనుపోతూ దారి ఇమ్మని అడుగుతే ఇవ్వక, ఘర్షణకుదిగి ఒకరిని చెంపమీదకొట్టాడు. అంతటితో కొట్లాట జరిగింది. దీనినిగూర్చి కాంగ్రెసునాయకు లిచ్చిన ప్రకటనలు చూడండి.

గుడివాడలో ఆంధ్రప్రభ విలేఖరి ప్రకాశంగార్ని ఇంటర్వ్యూ చేయగా ఇలా అన్నారు. "కమూనిస్టులవల్ల ఒక కాంగ్రెసుసేవకుడు దెబ్బలుతిన్నాడని విని ఎక్కడకో వెళ్ళవలసినవాడిని ఇక్కడకువచ్చాను. వానిని చూసాను." (ఆంధ్రప్రభ 13-11-45)

అసలు వీరు వచ్చి చేసింది కామ్రేడ్ సుందరయ్య సభను చెడ గొట్టుటకై ప్రయత్నాలు.

దీనినిగూర్చియే మాజీ పార్లమెంటరీకార్యదర్శి ఆంధ్రప్రభ సహాయ సంపాదకుడునగు బి. యస్. మూర్తిగారు 6-11-45 న గుడివాడనుండి

ఈ క్రిందిది ప్రకటన గావించారు. "రావులపాడు నివాసి అద్దంకి గోపాల స్వామిగారు కమ్యూనిస్టులచే బలమైన దెబ్బలు తిన్నాడు. శరీరమంతా రక్తమయంగావుంది. డాక్టరు బలమైన దెబ్బలు తగులుటయేగాక ఎముకలు కూడా విరిగినాయన్నారు. కాంగ్రెస్ ప్రచారమే ప్రధానాశయంగా పెట్టుకొని అనవరతమూ పనిజేస్తూన్న ఈ కాంగ్రెసు యువకుని ఇలా వక్కుమ్మడిగా ఒంటరిగా గుమిగూడి కమ్యూనిస్టులు కొట్టటం కమ్యూనిస్టుపార్టీ ఆశయముకే విరుద్ధం." బి. యస్. మూర్తిగారిచ్చిన ఈ ప్రశంసాపత్రాన్ని చూచి గుడివాడ తాలూకా పౌరు లెంత నవ్వుకుంటారోగదా!

కాంగ్రెసు ప్రముఖులైన కేతవరపు లక్ష్మీనరసింహారావుగారు ఒక ప్రకటనలో యీవిధంగా చెపుతున్నారు. "రావులపాడు అనే గ్రామము కృష్ణాజిల్లాలో గుడివాడకు సమీపంగావుంది. ఆ వూరిలో కాంగ్రెసువాదులు అల్పసంఖ్యాకులుగా వున్నారు. కొంతకాలంనుండి అచటి కాంగ్రెసువాదులను కమ్యూనిస్టులు హింసిస్తున్నారు. ఆసందర్భమైన క్రిమినల్ కేసులు కొన్ని విచారణలో వున్నాయి. ఇటీవల అద్దంకి గోపాలస్వామి అనే అతనిని దారిలో అడ్డగించి 30 లేక 40 మంది కమ్యూనిస్టులు అతనిని కొట్టియుండిరి. అతనికి ప్రమాదకరమైన దెబ్బలు తగిలి గుడివాడ అస్పత్రిలో వున్నాడు." (ఆంధ్రపత్రిక)

కాంగ్రెసు నాయకులే ఈ విధంగా అబద్ధాలు చెప్పుతుంటే జాతీయ పత్రికలేమి రిపోర్టు చేస్తున్నాయో చూడండి.

"రావులపాడులో కమ్యూనిస్టుల దౌర్జన్యం"

"నేడు తుపానువల్ల నష్టపడ్డ గ్రామాలకు కాలినడకనూ, వీలున్న చోట్ల కారులోనూ శ్రీ తెన్నేటి విశ్వనాధం, గొట్టిపాటి బ్రహ్మయ్య. వల్లభనేని రామబ్రహ్మంగార్లతో పరిసరాలలో సంచారం జేస్తూ ప్రకాశం గారు కమ్యూనిస్టులవల్ల ఒక కాంగ్రెసు సేవకుడు రావులపాడు గ్రామ నివాసి అద్దంకి గోపాలస్వామి యనునతను దెబ్బలు తిని మరణశయ్యపై నున్నాడని విని చూచుటకు వచ్చారు. ఒంటినిండ 32 దెబ్బలు తిని స్పృహతప్పి పడివున్న వానిని చూచి చాలాచింత పడ్డారు......ప్రకాశం పంతులుగారు వచ్చారని విని దెబ్బలుతిన్నవాని బంధువులు స్త్రీలతో సహా అనుయాయులూ అక్కడికి వచ్చారు. విశేషమేమని అంటే "మాపాకలు లాగివేస్తున్నారు. మమ్ములను కొట్టనుద్దేశిస్తున్నారు. భయపడివచ్చాము" అని వారన్నారు." (ఆంధ్రప్రభ)

కమ్యూనిస్టుల దౌర్జన్యం

"నిన్నటిదినం అద్దంకి గోపాలస్వామి (కాంగ్రెసు లీడరు) గారు గుడివాడ హాస్పటలులో అపాయకరమైన దెబ్బలతో కాంగ్రెసు సేవకుల సహాయంచే చేర్చబడిరి. రావులపాడు గ్రామములో కాంగ్రెసువారికినీ, కమ్యూనిస్టుపార్టీవారికినీ గల అంతఃకిలహములచే శ్రీ గోపాలస్వామిగారు దోసపాడు రైల్వే స్టేషనుకు వెళ్ళుచుండగా కమ్యూనిస్టు మెంబర్లు కొట్టి నట్లు తెలుస్తున్నది." (ఆంధ్ర పత్రిక)

ఆంధ్ర పత్రిక, ఆంధ్రప్రభలకు ఈ గోపాలస్వామి 'కాంగ్రెసు లీడరు' 'కాంగ్రెసు సేవకుడు' అయిపోయాడు!

రావులపాడు గ్రామంలోనే అయోధ్యరామయ్య, వెంకటాద్రి అనే ఇద్దరు వ్యక్తులున్నారు. వీరిద్దరూ కమ్యూనిస్టు వ్యతిరేకుల పక్షాన ఒక కేసులో ముద్దాయీలు. 18-11-45 అర్ధరాత్రివేళ వెంకటాద్రి అయోధ్య రామయ్య ఇంట్లోజొరబడ్డాడు. వెంటనే అయోధ్యరామయ్యలేచి ఇరుగు పొరుగువారిని కేకవేసి, వారి సహాయంతో వెంకటాద్రిని పట్టుకున్నాడు. జూపూడి అంజయ్య అనే ఒక వర్తకుడు ఇందులో సహాయపడ్డాడు. అంజయ్యా, అయోధ్యరామయ్య కలిసి వెంకటాద్రిని దొడ్లో వున్న ఒక చెట్టుకు కట్టివేసారు. తెల్లవారిన పిదప విచారణకు పోలీసు హెడ్‌కాని స్టేబిల్ వచ్చాడు. అయోధ్యరామయ్య ఒకస్టేట్‌మెంటు ఇస్తూ వెంకటాద్రి తన గొంతుక పిసికి చంపబోయాడనీ, ఎలాగో పట్టువిడిపించుకొని కేకలు వేయగా, వచ్చిన అంజయ్య సహాయంతో పట్టుకొని చెట్టుకు కట్టివేసి డ్యూటీలోవున్న పోలీసుకు వప్పజెప్పామనీ చెప్పాడు. వెంకటాద్రి స్టేటు మెంటులో తాను గేదె బేరానికి డబ్బుతీసుకొని తెల్లవారు ఝామున వెళ్ళుతూవుంటే కమ్యూనిస్టులు పట్టుకొని డబ్బులాక్కొని చెట్టుకు కట్టేసి నట్లు చెప్పాడు.

ఈవిషయాన్ని గూర్చి కాంగ్రెసు ప్రముఖుడగు "కేతవరపు లక్ష్మీ నర్సింహారావుగారు పైన పేర్కొన్న ప్రకటనలోనే ఇట్లా చెప్పుచున్నారు.

"అతని (గోపాలస్వామి) బావమరదియగు తోట వెంకటాద్రి గోపాలస్వామిని కనిపెట్టి చూస్తూ ఉపచర్యలు చేస్తున్నాడు. గ్రామంలో కొందరు పోలీసు బంట్రోతులుకూడా కాపలా వుంచబడిరి. గ్రామంలో అల్పసంఖ్యాకులుగావున్న కాంగ్రెసువాదులను చెదరగొట్టవలెననే వుద్దే

శంతో నిన్నరాత్రి తోట వెంకటాద్రిని పట్టుకొని ఒక కొబ్బరి చెట్టుకు తాళ్ళతో కట్టేసారు. అతనిమీద చన్నీళ్ళుపోసి అతనిని బాగా దెబ్బలు కొట్టారు. అతనిని ఉదయం 9 గంటలకు కట్లు విప్పి విడుదలచేసి గుడివాడకు తీసుకువచ్చి అతనిని ఆస్పత్రిలో జేర్పించారు. అతని స్థితి ఆందోళనకరంగానేవుంది."

దీనిని గూర్చి పత్రికావార్త లెట్లున్నవో చూడండి.

"గుడివాడ పోలీసువారు రావులపాడు కాపురస్థులున్నూ కమ్యూనిస్టు పార్టీమెంబర్లు అయిన డి. రాఘవయ్యను మరియు అయిదుగురిని అరెస్టు చేసి నిన్న గుడివాడ తీసుకువచ్చారు. వీరు కాంగ్రెసు వర్కరు అయిన తోట వెంకటాద్రి అను నతనిని చెట్టుకు కట్టివేసి మొన్నటిరాత్రి గొప్పగా హింసించారని తెలుస్తున్నది." (ఆంధ్ర పత్రిక)

కమ్యూనిస్టు వ్యతిరేకత చివరికి ఎట్లా పరిణమిస్తోంది అంటే చీకటి తప్పులనుకూడా సమర్థించటం కాంగ్రెసు నాయకుల పనిగా కన్పడుతోంది!

## పోలీసులచుట్టూ తిరగటం

ఈ విధంగా కాంగ్రెసు నాయకుల ధోరణి శృతిమించి రాగాన పడుతేగాదు. కమ్యూనిస్టుల నెట్లాగైనా అణచాలి అనే వీరి పట్టుదల వీరినెంతో నైతికంగా పతనంగావిస్తోంది. స్వాతంత్ర్యాభిలాషియగు ప్రతి భారతీయుడూ ఏ పోలీసు ఉద్యోగిబృందాన్ని జాతీయశత్రువుగా భావించు తాడో అట్టి పోలీసుబృందాన్ని సహాయం జేయమని వీరు ప్రాధేయ పడు తున్నారు. లోగడ కల్లూరి చంద్రమౌళి, బాపినీడు, కాశేశ్వరరావుగార్లు ఈవిధంగా ప్రభుత్వ సహాయాన్ని అర్థించటం ప్రజలచే ఈసడింపబడటం జరిగింది. ఇది వీరితోనే అంతమౌతుందని భావించాము. కాని అఖిలభారత కాంగ్రెసువర్కింగుకమిటీ సభ్యులగు పట్టాభిగారు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులగు ప్రకాశంగారుకూడా కాశేశ్వరరావు, చంద్రమౌళిగార్ల వలె పోలీసులను 'మాకు సహాయంరండోయ్' అని ప్రాధేయపడి అడుగు చున్నారు. గుంటూరు సభలపై ప్రకాశంగారు మాట్లాడుతూ "జిల్లా అధి కారులు ఈ విషయంలో తమ విధ్యుక్తధర్మాన్ని నెరవేర్చగలరా, ఉపే క్షించి వున్నారంటేనాకు ఆశ్చర్యంగా వుంది." అని కమ్యూనిస్టుల పని పట్టండోయ్ అన్నట్లుగా జిల్లాఅధికారులకు హెచ్చరిక చేస్తున్నారు. తుపా

ననుగూర్చిన ప్రకటనలో ప్రకాశంగారు "ఒక సభలో ఒక కమ్యూనిస్టు నాపై మాట తూలటంతో నాగాయలంక పోయేసరికి పోలీసు సిబ్బంది సిద్ధంగా వచ్చివుంది. ఎందుకని అడుగగా దౌర్జన్యం జరక్కుండా చూడ డానికని తెలిసింది. ఎన్నికలసభల్లో దౌర్జన్యం జరగకుండా కాపాడవలసిన బాధ్యత పోలీసు అధికారులకు వుంది." అని తిరిగి పోలీసులకు హుషా రిచ్చారు. (ఆంధ్రపత్రిక) కేశవరపు లక్ష్మీనరసింహారావుగారు "అధికారులు ఈవిషయంలో శ్రద్ధవహించవలసి యున్నది. ఈ కమ్యూనిస్టు చర్యలను అణచివేయనియెడల ప్రజలకిక శాంతిభద్రతలనేవి ఉండవు." అని కమ్యూ నిస్టులనణచి వేయమని సూటిగా ప్రభుత్వానికి విజ్ఞప్తిచేసారు. (ఆంధ్ర పత్రిక) వీరు విజ్ఞప్తిచేయటమేగాదు, పోలీస్ అధికారుల చుట్టూ తిరుగుతూ కమ్యూనిస్టులపై ఏవిధంగానైనా కేసులను బనాయించాలని నానా తిప్పలు పడుతున్నారు.

ఒకనాడు సైమన్ కమిషన్ బహిష్కరణోద్యమంలో పోలీసుల తుపాకులకు గుండెలిచ్చి వీరత్వమును ప్రదర్శించిన ప్రకాశంగారు ఈనాడు పోలీసుల సహాయం అర్ధించడం వారికి ఉచితంగా తోచిందేమోగాని ఆ ఉజ్వల సంఘటనవల్ల ఉత్తేజితులమైనమాకు మాత్రంవారికి హృదయ విదారకంగావుంది.

కాంగ్రెసు నాయకులయొక్క వినాశకరమగు ఈ వైఖరి, జాతీయ పత్రికల వక్రభాష్యాలూ చాలారోజులకు పైగా సాగుతూనే వున్నాయి. ఈ పోకడలు ఆంధ్రదేశంలో జాతీయోద్యమానికీ ప్రజా వుద్యమాలకు చాలా అపాయకరమైనదనీ, ప్రజా శత్రువులగు దొంగ వ్యాపారులకూ, జమీందారీ దుండగీడులకూ, రౌడీలకూ, ప్రజాస్వామ్యహక్కులను అరి కట్ట సిద్ధంగా కాచుకొని కూర్చున్న ప్రభుత్వానికీ చాలా మంచి అవకాశ మును కల్పించుటయనీ కమ్యూనిస్టులం పదేపదే హెచ్చరించాము. కాంగ్రెసు నాయకుల ననేక పర్యాయాలు కలుసుకొని దేశశ్రేయస్సుకై ఈ అపాయకరమగు పోకడను విడనాడమని కోరాము. కాని నిష్ప్రయో జనమైంది. పిమ్మట పట్టాభిగారు విడుదల కాగానే కామ్రేడ్ సుందరయ్య వారిని బందరులో కలుసుకొని ఈ విషయాలను గూర్చి చర్చించ ప్రయ త్నించారు. కాని పట్టాభిగారు రాజకీయాలనుగూర్చి మాట్లాడుటకే తిర స్కరించారు. కుశల ప్రశ్నలతో పూర్తిజేసి సాగనంపారు. పిమ్మట ప్రకాశంగారు విడుదలై వచ్చి పట్టాభిగారి పాటనే అందుకుంటే ఆంధ్రి

కమిటీ కార్యదర్శి కా[మేడ్ చం[ద రాజేశ్వ[రావు తొందర పడక నిజం తెలిసికోండని వారికి బహిరంగంగా విజ్ఞప్తిజేసాడు. కాని ఈ[పయత్నమూ నిష్ఫలమైంది. ఈ బాధ్యతగల నాయకులే హుషారీగా ఛోటానాయకులూ, కాం[గెసు సేవకులూ విపరీతమగు దు[ష్పచారాన్ని సాగించుతూ, అంత టితో పూరుకొనక [పతిచోటా కలహాలను తీసుకువస్తున్నారు. కమ్యూ నిస్టులు బలంగా వున్న [గామాలలో సహితం వీరిట్టి దౌర్జన్యాలను సాగి స్తూవున్నారు. అయినా దేశభక్తులమధ్య ఐక్యతనే తమ పాలసీగా పెట్టు కొన్న కమ్యూనిస్టులు ఇందుకు [పతీకారంజరపటంలేదు. ఆఖరికి,కాం[గెసు వాదుల మీటింగులకు వెళ్ళితే వారితిట్లనుగాని, నిందలనుగాని సహించి ఊరుకోవలసిందేగాని [పశ్నలు కూడా వేయవద్దని కమ్యూనిస్టులందరికి సలహా యివ్వబడింది. ఇందుకు కా[మేడ్ సుందరయ్య ఇచ్చిన హెచ్చరి కను గుర్తుకు తెస్తున్నాను. "కాం[గెసు నాయకులు ఉపన్యసించే సభలకు కమ్యూనిస్టులు వెళ్ళితే ఎట్టి [పశ్నలూ వేయవద్దనీ, ఈరోజు పరిస్థితులలో వారిని ఎట్టి [పశ్నలు వేసినా సభలలో ఘర్షణతప్ప మరేదీరాదనీ మేము గట్టిగా వాదిస్తున్నాము. అయినా వడాలి, ముదినేపల్లి మరొకటి రెండు స్థలాల్లో [పకాశంగారిని [పశ్నలు వేశారనీ సభలలో కొంతగల్లంతుబయలు దేరిందనీ రిపోర్టులు వచ్చాయి. ఎటువంటి [పశ్నలూ ఇకముందు వేయ వద్దని కమ్యూలను బలపర్చేవారికి మేము పదే పదే చెబుతున్నాము"

(ఆం[ధ[పభ)

దేశభక్తులమధ్య అంతఃకలహాలను నివారించుటకై కమ్యూనిస్టులు ఇంత సహనభావాన్ని పూనుతుంటే. కాం[గెసు నాయకులు తమ అను చరులకు యిచ్చేటటువంటి సూచనలేమిటి?

పట్టాభిగారు కాం[గెసు వర్కింగు కమిటీ సభ్యుడు. గాంధీజీ సిద్ధాంతములకు భాష్యకారుడని వాసిగాంచారు. అట్టి వీరైనా ఈ దౌర్జన్య చర్యలను అరికట్టుదురేమోనని ఆశించాము. కాని వీరు బైటకు రాగానే బందరులో జరిగిన సభలో తన పు[తుడడిగిన [పశ్నకు జవాబిస్తూ "ఇది వరకు మీరు వత్తాసు యిచ్చారు కాబట్టే కమ్యూనిస్టులు విజృంభించారు. రేపటినుండి వారి ఆటలు సాగవు, స్వాతం[త సంపాదనలో [బిటీషువారి మీదమా[తం మనం అహింసావలంబకులం. మనలోమనకు కలహాలువస్తే హింస వుపయోగించాలి. దెబ్బకు దెబ్బ కొట్టాలి. అందువల్లనే [పతివాలం టీరుకూడా మీటింగులకు వచ్చేటప్పుడు లాఠీలను తెమ్మని నేను [పతివారికీ

చెప్పుతున్నాను"అని కాంగ్రెసువలంటీర్లను వుసిగొల్ప ప్రారంభించేసారు. వీరేగుండుగొలనులో ఉపన్యసిస్తూ "నేను విడుదలైనతర్వాత పరిస్థితులను బాగా కనిపెట్టాను. కాంగ్రెసు అహింసా సిద్ధాంతాన్ని ప్రతిచోటా కమ్యూనిస్టులు అవకాశం తీసికుంటూ వచ్చారు. అంతట నేను అహింసా యుద్ధమనేది బ్రిటీషు ప్రభుత్వంవారినుండి దేశస్వాతంత్ర్యాన్ని రాబట్టుకోవడంకోసం ఉపయోగించవలసిన సాధనమనీ, అవుసరమైనప్పుడు, హింసాకాండ సాగుతున్నప్పుడు కాంగ్రెసు వాదులు ఆత్మరక్షణకై లాఠీలు వుపయోగించవచ్చునని స్పష్టపరిచ్చాను. అటుతర్వాత కమ్యూనిస్టుల దౌర్జన్యాల తీవ్రతతగ్గింది." అని మరల తన అనుచరులకు హుషారిచ్చారు. అసలు కమ్యూనిస్టుల దౌర్జన్యాలూలేవు, వాటితీవ్రత తగ్గటమనేది లేదు. నిజానికి కాంగ్రెసు వర్కింగుకమిటీ సభ్యుడంతటి వాని హామీతో భూపతి కోటేశ్వరరావు కమ్యూనిస్టు వ్యతిరేకులకు రౌడీలకు హుషారు హెచ్చి కమ్యూనిస్టులపై దౌర్జన్యాలను తీవ్రంజేశారు.

ప్రకాశంగారుకూడా ఇదేరీతిని కాంగ్రెసు వర్కర్లను కమ్యూనిస్టులపైకి ఉసికొల్పుతున్నారు. రాజమండ్రిలో ఉపన్యసిస్తూ "అహింస బ్రిటీషు ప్రభుత్వంతోనే" అని నిర్వచనం చేశారు. కాబట్టే భూపతి, పఠానేని ముఠా కామ్రేడ్ చౌదరిని రాజమండ్రిలో కొట్టటానికి సాహసించటంజరిగింది. కాశేశ్వర్రావుగారు కూడా, తానూవున్నానంటూ మరొక మెట్టు పైకి ఎక్కి "మా ప్రభుత్వంలో కమ్యూనిస్టులు యిలా ప్రవర్తించితే క్రిమినల్సుగా ట్రీట్ చేస్తాము. జొన్న కూడుతినిపిస్తాము. వారిని రాజకీయ ఖైదీలుగా పరిగణించము." అన్నారు. ప్రకాశంగారు గుడివాడ సభలో "ఆత్మరక్షణ, కొరకుఏమైనా చేయవచ్చును. చివరకు ఖూనీచేసినా నేరంలేదు. నీతల పగులగొడుతూవుంటే అహింసఅంటూ కూర్చోవడం పొరబాటు. ఆత్మరక్షణను చేసుకొనడంమాని అహింసను అపార్థం చేసుకోకండి." అని కాంగ్రెసు వాదులను హెచ్చరిస్తూ చెప్పారు. మంచిదే ఆత్మరక్షణచేసుకోమని ప్రతి ఆత్మగౌరవం, పౌరుషంగలవాడూ చెపుతాడు. కాని, దురదృష్టవశాత్తు ఈ భావాలన్నీ అభూతకల్పనలుచేసి కమ్యూనిస్టులపైకి కాంగ్రెసు వర్కర్లను వుసికొల్పటానికికై ఉద్దేశింపబడినవి. లేకపోతే బండ్లలోని స్త్రీలపై రాళ్ళు రువ్వటం ఆత్మరక్షణకొరకా?

నాయకులే ఇట్లు ప్రోత్సాహమిస్తుండగా దీని నవకాశంగా దీసికొని రౌడీలు, దొంగవ్యాపారుల సహాయంతో భూపతి పఠానేని మున్నగు

వారి ముఠావారు బహిరంగ ఫాసిస్టు తద్ధతులకు పూనుకొంటున్నారు. రాజమండ్రిలో చౌదరిని కొట్టిన ఉదంతం పైననే వివరింపబడింది. వీరి ఆధ్వర్యముననే అనేక గ్రామాలలో ప్రదర్శింపబడే బుర్రకథలు వగైరాలలో అసభ్యకరమగు బూతులు వుండటమేగాక. హింసాకాండకుపూనుకోండని బాహాటంగా ఎలుగెత్తి చెప్పుతున్నారు.

"ప్రజాశక్తి అమ్మకునే పంచమాంగ దళంబట్టి.
చావగొట్టి చెవులుమూసి చంపిపారవేయరా,
కళ్ళనీళ్ళు బెట్టినా కాళ్లపట్టివేడినా,
కనికరమింతైనలేక కత్తిబట్టినరకరా."
అనేగీతాన్నీ,
"సుందరయ్య పుచ్చ ఎగరాలిరా,
చలసానివారి చెంప పగలాలిరా."

అనే గీతాన్ని వేదికలమీదినుండి పాడుతున్నారు. పళ్ళంరాజు, తిరుమలరావు. లింగరాజు మొదలగు కాంగ్రెసుప్రముఖులున్న సభలలోకూడా ఇట్టి పాటలను పాడటం, దానికి ఈ ప్రముఖులు హర్షధ్వానాలు గావించటం జరుగుతోంది. ఇవన్నీ కాంగ్రెసు ఎన్నికల ప్రచారంలోజరిగేవే!

## కాంగ్రెసువాదులకు విజ్ఞప్తి

అమాయకులైన ప్రజలయొక్క, కాంగ్రెసు వాదులయొక్క బుర్రలను కమ్యూనిస్టులు పగులగొట్టారనే నిందలను, ప్రకాశం, పట్టాభిగార్ల వంటి ప్రముఖకాంగ్రెసునాయకులు వేస్తున్నారు. వాటిని జాతీయ పత్రికలగు ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ బాకాలూదుతున్నాయి. కాని ఇవన్నీ శుద్ధఅబద్ధం. నేడు ఆంధ్రప్రజలు తిండి బట్టలు తదితర జీవితావుసర వస్తువులు దొరకక నానాబాధలు పడుతున్నారు. దొంగవ్యాపారం పెచ్చు మీరిపోయింది. జమీందారీ దుర్ణయాలు విజృంభిస్తున్నాయి. రౌడీల, గ్రామపెత్తందార్ల నిరంకుశాలు జోరైనాయి. కాబట్టి కమ్యూనిస్టులం ఈ దొంగవ్యాపారాన్నీ, ఈ ప్రజాశత్రువుల దుండగాలనూ అరికట్టటానికి ప్రయత్నాలు గావించాం. ఇందువల్ల స్వార్థపరులైన దొంగవ్యాపారులూ, దుర్నీతిపరులగు పెత్తందార్లూ జమీందారీ ఏజంట్లూ మాపై తగవులకు సిద్ధమౌతున్నారు. రౌడీలను పురిగొల్పుతున్నారు. ఈ విధంగా మేము ప్రజాసేవ జేస్తూ ఈ ప్రజాద్రోహులతో పోరాడవలసి వస్తోంది.

కాని ఈ ప్రజాద్రోహులకు కాంగ్రెసునాయకులు కాంగ్రెసుబురఖాను తగిలిస్తున్నారు. ప్రజలను పీడించే దొంగవ్యాపారులనూ, జమీందార్లనూ, రౌడీలనూ బలపరుస్తున్నారు. ప్రజాసేవజేస్తున్న సోదరీమణులను నిందిస్తున్నారు. పార్టీసభ్యులపై దుష్ప్రచారాన్ని గావిస్తున్నారు. అసభ్యకరమైన వెంగమ్మ నాటకాన్ని, బుర్రకథలనూ, హరికథలనూ ప్రోత్సహిస్తున్నారు.

ఈపరిస్థితులిలాగే సాగితే, కమ్యూనిస్టులను నాశనం గావించాలనే వుద్దేశాన్ని కాంగ్రెసు నాయకులు ప్రధానంగా పెట్టుకొని కాంగ్రెసు సేవకులకు అదే కార్యక్రమంగా ఇస్తే ఎట్టి దుష్ఫలితాలుకల్గుతాయో గుర్తించమని ప్రతి కాంగ్రెసువాదినీ, ప్రతి స్వాతంత్ర పిపాసినీ, ప్రతి ఆంధ్రాభిమానినీ కోరుతున్నాము. ఇలా మనలో మనం కొట్టుకుంటూవుంటే బ్రిటిష్ ప్రభుత్వము మనమీద ఏకచ్ఛత్రాధిపత్యాన్ని నిల్పుకుంటూనే వుంటుందిగదా ?

ఎన్నికలు శాంతంగా, క్రమంగాజరుగుతాయా? ప్రజాభిప్రాయంవెల్లడిఅవుతుందా ? ఎన్నికలలో పెత్తనమంతా పోలీసుల చేతులలోవుండదా ?

నేడు ఆంధ్రప్రజానీకాన్ని ఎదుర్కొంటున్న భీషణ సమస్యలను జయప్రదంగా పరిష్కరించ గలమా ?

ఈ క్లిష్ట పరిస్థితులలో ఆంధ్ర కాంగ్రెసు నాయకులకు ఒకవిన్నపం గావిస్తున్నాము. ఆంధ్రజాతీయ వికాసానికి మూలపురుషులైన కందుకూరి వీరేశలింగంగారి కృషిని మీరు ముందుకు తీసుకుపోవడానికి ఈ గత 20 సంవత్సరాలూ కృషిజేసారు. ఆ కృషినే మరింత ముందుకు తీసుకుపోవడానికై కృషిజేస్తున్న మేము మీకు విజ్ఞప్తి జేస్తానికి అధికారం అవుసరం వున్నాయి. ఆంధ్రజాతీయోద్యమాన్ని పెంచి పోషించిన మీరు పరిస్థితులు విషమించకముందే మీఅనుచరుల్ని మందలించండి. ప్రజాద్రోహులకు రక్షణయిచ్చి కాంగ్రెసు కీర్తికి మచ్చ తీసుకురాకండి. ఈనాడు యువకులైన కాంగ్రెసు సేవకులను కమ్యూనిస్టు వ్యతిరేకతపై తయారుచేస్తే వీరు దేశభక్తులుగా తయారౌతారా ?

కాబట్టి మేము విన్నవించేదేమిటంటే నిందలను, దూషణలను దౌర్జన్యాలను మానండి. కాంగ్రెసును నిష్కల్మషం చేయండి. కాంగ్రెస్ పూర్వప్రతిష్టను తిరిగి నెలకొల్పండి. ఎన్నికలలో స్వచ్ఛ హృదయాలతో, ప్రవేశించండి.

— నండూరి ప్రసాదరావు

## వీటినికూడా చదవండి!

### రంగా రాజకీయాలు

కమ్యూనిస్టులు జాతీయ విద్రోహులనీ, తను జాతీయోద్యమాన్ని రక్షించుతాననీ రంగా ప్రగల్భాలు కొడుతున్నాడు. పోటీ రైతుసంఘాలు పెట్టి రైతు ఉద్యమాన్ని విచ్ఛిన్నం చేస్తున్నాడు. ఈయన బండారం తెలుసుకోవాలంటే ఈ పుస్తకం చదవండి.

వెల 0—5—0

### కమ్యూనిస్టు సర్క్యూలర్లు - వ్యతిరేకుల పచ్చి అబద్ధాలు

ఆంధ్రలోని కమ్యూనిస్టు వ్యతిరేకులు కమ్యూనిస్టు సర్క్యూలర్లలోని విషయాలంటూ కొంత తమ పైత్యంకూడాకలిపి ప్రచారం చేస్తున్నారు. అసలు సర్క్యూలర్లలో ఏముందో తెలుసుకోటానికి ఇది చదవండి.

వెల 0—3—0

### గాంధీ - జోషీ లేఖలు

కమ్యూనిస్టుపార్టీ ఎడల గాంధీజీ అభిప్రాయాలు వాటికి జోషీ సమాధానాలు ఏమిటో తెలుసుకోవాలంటే ఈ పుస్తకం చదవండి.

వెల 0—6—0

### కమ్యూనిస్టులు - కాంగ్రెస్

ఇంగ్లీషు, హిందీ, ఉరుదు, బెంగాలీ, తెలుగుభాషల్లో మూడు వారాల్లోనే 75,000 ప్రతులు అమ్ముడుబోవటమే, ఈ పుస్తకం చదవవలసిన అవుసరాన్ని తెలియజేస్తోంది.

వెల 0—4—0

★

ప్రతులకు :

## ప్రజాశక్తి ప్రచురణాలయం

గవర్నరుపేట - బెజవాడ.